

CHANDAMAMA
DECEMBER 1991

M. L. Narasimhan



# చందమామ

## నవంబర్ 1997






విడిప్రతి : 6-00

సంవత్సర చందా : 72-00

# POLIO, QUIT INDIA!

Protect your child and the nation!
Participate in the mass
polio vaccination!




## December 7, 1997
## January 18, 1998

CALLING PARENTS!

Even if

- the child is indisposed or has diarrhoea
- the child had been given polio drops earlier

**TO ENSURE CENT PER CENT PROTECTION**



**Remember to**

Take your children (under 5) to the nearest immunisation booth / centre to receive

**TWO ADDITIONAL DROPS OF THE ORAL POLIO VACCINE on National Immunisation Days**



Be a part of the global Polio Eradication Campaign




**You don't just have to protect, but help eradicate POLIO**



# చందమామ




సంస్థాపకుడు : 'చక్రపాణి'　　సంచాలకుడు : బి.నాగిరెడ్డి

## ఎల్లలులేని మంచితనం!

స్వాతంత్ర్య స్వర్ణోత్సవాలను జరుపుకుంటూన్నప్పుడు, మనకు స్వాతంత్ర్యం సాధించి పెట్టిన మన పెద్దల ధైర్య సాహసాలనూ, త్యాగాలనూ స్మరించుకోవడం సహజం. అలాగే వారి దేశభక్తికీ, త్యాగనిరతికీ నివాళులర్పిస్తూ, ఆ ఉదాత్త గుణాలను అలవరచుకో వడం మన కర్తవ్యం!

స్వాతంత్ర్య పోరాటాన్ని అణగదొక్కాలన్న ఉద్దేశంతో, స్వాతంత్ర్య యోధులను నానా హింసలకు గురిచేసిన అధికారులు చరిత్రలో కోకొల్లలుగా ఉన్నారు. అయితే, అటువంటి వారి మధ్య కూడా మన దేశ ప్రజలనూ, భాషాసంస్కృతులనూ ఆదరించి ప్రేమించిన స్నేహమూర్తులూ లేకపోలేదు. అలాంటి వారిలో చాలామంది వలస ప్రభుత్వంలో అధికారులుగా ఉన్నవారే. కాని మంచితనం ఎల్లలు లేనిది! వారిలో కొందరు సాంచీస్థూపం, అజంతా-ఎల్లోరా గుహల చారిత్రక కళావైభవాలకు ముగ్ధులయ్యారు. మరికొందరు మన ప్రాచీన గ్రంథాలను ఆంగ్లంలోకీ, ఇతర భాషలలోకీ అనువదించారు. ఇంకా కొందరు మన భాషా వ్యాకరణ రీతులను సంకలనం చేశారు; కర్ణ పరంపరగా చెప్పుకునే సంప్రదాయ గాథలను సేకరించారు. కొందరు పేదలకు, రోగులకు తమ సేవలు అందించారు!

మన చరిత్రను అధ్యయనం చేసేప్పుడు అందులో మంచి ఎక్కడున్నా స్వీకరించాలి. చరిత్రలో కలిసిపోయిన చెడు, పునరావృతం కాకుండా జాగ్రత్త పడాలి. మంచి చేసినవారు; మంచిదారి చూపిన వారు; ఎవరైనా సరే తన, పర భేదం చూడకుండా వారికి మనసారా కృతజ్ఞతలు చెప్పుకోవాలి. వారి మంచి గుణాలను మనం అలవరచుకోవాలి. అదే జాతి పురోగతికి తరగని నిధి అవుతుంది!

సంపుటి: 101　　నవంబర్ '97　　సంచిక : 5

విడిప్రతి : 6-00　　సంవత్సర చందా　　72-00






Rs. 30/-




Rs. 40/-




Rs. 30/-




Rs. 30/-




Rs. 25/-




Rs. 30/-

**CHANDAMAMA BOOKS ARE ALREADY A LEGEND! THEY OPEN A NEW HORIZON ON THE WORLD OF LITERATURE FOR THE YOUNG**

Added to the six titles by **Manoj Das** is the charming seventh–

**WHEN THE TREES WALKED**

by the inimitable story-teller **Ruskin Bond**




Rs. 30/-

Among the titles in the process of production are:

**STORY OF KRISHNA**
**STORY OF RAMA**
**STORY OF BUDDHA**



For details, write to:

**CHANDAMAMA BOOKS**
Chandamama Buildings
Vadápalani, Madras - 600 026.

## వార్తలు-విశేషాలు:
# పోలండులో నూతన ప్రభుత్వం

పోలండులో మళ్ళీ ఇప్పుడు కమ్యూనిస్టేతర ప్రభుత్వం అధికారానికి వచ్చింది. సెప్టెంబర్ 21వ తేదీ జరిగిన ఎన్నికలలో పోలండు ప్రజలు సాలిడారిటీ పార్టీకి అధికారం అప్పగించారు.

1945వ సం॥లో ముగిసిన రెండవ ప్రపంచ యుద్ధానంతరం పోలండులో ఏర్పడిన కమ్యూనిస్టు పరిపాలన దాదాపు నలభై సంవత్సరాలు కొనసాగింది. ఆ తరవాత, అంటే ఇప్పటికి దాదాపు పదిహేను సంవత్సరాల క్రితం 'సాలిడారిటీపార్టీ' అధికారం చేపట్టింది.



1939వ సం॥లో జర్మనీ-నియంత అడాల్ఫ్ హిట్లర్ పోలండును ఆక్రమించడంతో రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభమయింది. అప్పుడు సోవియట్ యూనియన్, జర్మనీ దేశాలమధ్య పరస్పర దురాక్రమణ నిషేధ ఒప్పందం అమలులో ఉండేది. జర్మనీ, జపాన్, ఇటలీ దేశాలు కలిసి 'యాక్సిస్' అనే బలమైన కూటమి తయారయింది. అమెరికా, ఇంగ్లాండ్, ఫ్రాన్స్‌వంటి మిగిలిన దేశాలు మిత్రపక్షాల పేరుతో ఒకటిగా చేరాయి.

ఆరేళ్ళపాటు జరిగిన యుద్ధంలో తొలి దశలో చవిచూసిన విజయం కారణంగా, హిట్లర్ దృష్టి పోలండుకు ఆనుకుని వున్న సోవియట్ యూనియన్ ప్రాంతం మీద పడింది. ఆ కారణంగా సోవియట్ యూనియన్ మిత్రపక్షాలతో చేతులు కలపాలని నిర్ణయించడంతో యూరపుఖండంలో 'యాక్సిస్' విజయావకాశాలు తారుమారయ్యాయి. సోవియట్ యూనియన్, పోలండుతో పాటు మరి కొన్ని తూర్పు యూరపు దేశాలకు జర్మనీ నుంచి విముక్తి కలిగించింది. మిత్రపక్షాల సేనలు పడమటి దిశనుంచీ, సోవియట్ యూనియన్ సేనలు తూర్పు దిశ నుంచీ జర్మనీ రాజధాని బెర్లిన్ నగరంలో ప్రవేశించాయి. హిట్లర్ ఆత్మహత్య చేసుకున్నాడు. జర్మనీ - పశ్చిమజర్మనీ, తూర్పుజర్మనీ అని రెండుగా చీలిపోయింది. బెర్లిన్ నగరం కూడా రెండుగా విభజించబడింది. కాని 1990వ సం॥లో జరిగిన ఏకీకరణ తరవాత ఇప్పుడు మళ్ళీ ఒకే జర్మనీగా ఉంటున్నది.

తమకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కలిగించిన దేశంగా, సోవియట్ యూనియన్ పట్ల పోలండు ప్రజలు గౌరవాభిమానాలు చూపారు. పోలండులో కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పడడానికి సోవియట్ యూనియన్ ప్రోత్సహించింది. యుద్ధానంతరం 1948వసం॥లో జరిగినఎన్నికలలో కమ్యూనిస్టులు ప్రభుత్వాధికారాన్ని చేపట్టారు. ముప్ఫైయేళ్ళ తరవాత 'సాలిడారిటీ ట్రేడ్ యూనియన్' ఉద్యమం బయలు దేరడంతో తరచూ సమ్మెలు, పోరాటాలు జరిగినప్పటికీ 1980 వరకు కమ్యూనిస్టు అనుకూల వర్గాల వారి చేతుల్లోనే అధికారం కొనసాగింది. 1983వ సం॥ నాటికి 'సాలిడారిటీ' ఒక రాజకీయ శక్తిగా రూపొందింది. 1989వ సం॥లో లెక్ వాలేసా నాయకత్వంలో మొట్టమొదటి కమ్యూనిస్టేతర - ప్రభుత్వం ఏర్పడింది. అయితే 1993వ సం॥లో మళ్ళీ కమ్యూనిస్టులకు ఆదరణ పెరగడంతో సాలిడారిటీ అధికారాన్ని కోల్పోయింది. లెక్ వాలేసా అధ్యక్ష పదవి నుంచి వైదొలగాడు.

నాలుగేళ్ళ తరవాత మరియన్ క్రజక్ల్యూస్కీ నాయకత్వంలో ఇప్పుడు సాలిడారిటీ పార్టీ ఆశ్చర్యకరంగా మళ్ళీ అధికారంచేపట్టింది. జెర్సీ బ్యుసెక్‌ను ప్రధానమంత్రిగా పార్టీ ఎన్నుకున్నది.





# రాక్షసుడి పెళ్ళి

పూర్వంకోసలరాజ్యపురాజధానీనగరంలో, భైరవశాస్త్రిఅనేమంచి వాక్చాతుర్యం గల అతనుండేవాడు. అతడికి చదువంతగా అబ్బలేదు. అయినా, తన చతురసంభాషణతో నలుగురినీ నవ్విస్తూండేవాడు. అతడిబావగారురాజాస్థానంలోని పండితులలో ఒకడు. బ్రహ్మచారిఅయిన భైరవశాస్త్రి బావగారి ఇంట వుంటూ, ఇంటి పనుల్లో అక్కకు సాయపడుతూండేవాడు.

ఒకనాడు భైరవశాస్త్రిబావ, భార్యతో, "మనమహారాజుగారి ఒక్కగా నొక్క కుమార్తె స్వర్ణచంద్రికకువివాహప్రయత్నాలు జరుగుతున్నవి. ఆయనగారు వైదేహి రాకుమారుణ్ణిఅల్లుడుగా చేసుకోవాలనుకుంటున్నాడు. మన రాజ్యంకన్న వైదేహీరాజ్యం పెద్దది. ఆ రాజు, ఈ వివాహానికి సమ్మతిస్తాడా లేదా అన్న సంశయంలో వున్నాడు, మన మహారాజు," అన్నాడు.

దానికి భైరవశాస్త్రి అక్క, "ఎందుకండీ సంశయం! నా తమ్ముడు భైరవుణ్ణిపంపితే కాస్త చమత్కారం, మరికాస్త వాగ్ధాటీ ఉపయోగించి, సుర్యాస్తమయం లోపల సంబంధం కుదుర్చుకురాగలడు," అన్నది.

"అవునవును,నీ తమ్ముడు ఒక్క చదువు సంధ్యల్లో తప్ప అన్నిటా సమర్థుడే!" అంటూ భైరవశాస్త్రిబావ పెద్దగా నవ్వాడు.

అక్కడేవుండి, ఈ సంభాషణ విన్న భైరవశాస్త్రికి, ఈ సంబంధం కుదిర్చి, మహారాజునుంచి ఏ అగ్రహారమో సంపాయించాలన్న ఆలోచన కలిగింది. ఆ మర్నాడే ఎవరికీ చెప్పకుండా సూర్యోదయంతోపాటే వైదేహీరాజ్యానికి ఉత్సాహంగా బయలుదేరాడు.

కోసల, వైదేహీ రాజ్యాల మధ్య ఒక కీకారణ్యం వున్నది. అందులో రాక్షసుడొకడున్నాడన్న భయంతో ప్రజలు, కొంత

ఎన్. శివనాగేశ్వరరావు

చుట్టుదారి అయినా, ఒక చిట్టడవిగుండా ప్రయాణం చేసి వైదేహికి పోతూండేవాళ్ళు.

భైరవశాస్త్రి,ఈ చుట్టుదారిన వైదేహికి బయలుదేరి, మిట్టమధ్యాహ్నం అయ్యే సరికి అడవిలోనికొలనుచేరి నీళ్ళు తాగి ఆయాసపడుతూ ఒక చెట్టుకింద కూర్చు న్నాడు. క్రమంగా అతడికి కునుకు పట్ట సాగింది.

ఆ సమయంలో భూమి దద్దరిల్లేలా అడుగులువేస్తూ, ఒకముసలిరాక్షసి అక్క డికి వచ్చి, "భైరవకోనరాక్షసుల కొలను నీరంటిన నువ్వెవడివి?" అని గద్దించింది.

భైరవశాస్త్రితత్తరపడుతూ లేచి నిల బడి, చావుతప్పదని వణుకుతూనే, "రాక్ష సమ్మా! నాపేరు భైరవశాస్త్రి. భైరవ కోన వారైన తమ ఆకలితీర్చేందుకు, విధినన్ని క్కడికి పంపివుండాలి! పూర్వజన్మలో మని ద్దరివీ ఒకే గోత్రమై వుంటుంది. సగోత్రుల మాంసం నిషిద్ధమని రాక్షస పండితవ ర్యులు కూడా ఒప్పుకున్న సత్యమేగదా!" అన్నాడు.

ఆ మాటలకు ముసలిరాక్షసి విరగబడి నవ్వుతూ గట్టిగా చప్పట్లు చరిచింది. ఆ మరుక్షణం గుబురు చెట్ల చాటు నుంచి ఒక పడుచు రాక్షసి అక్కడికి వచ్చి, భైరవశాస్త్రికేసి పరీక్షగా చూసి, తల్లితో, "అమ్మా! నేను లోగడే చెప్పా గదా! మనం భైరవ కోనలో వున్నప్పుడు, ఆ ముసలి భిల్లురాలి నుంచి నేర్చుకున్నది, జంతువుల మాంసాలు వండడం. మనిషి మాంసం వండడం, నాకు చేతకాదు," అన్నది.



రాక్షసిపడుచు జవాబుతో భైరవశాస్త్రికి ఒక ఉపాయంతోచింది. అతడు పడుచు రాక్షసికేసి మెచ్చుకోలుగా చూస్తూ, "రూపా నికేంగాని, నీ కూతురు అందచందాల్లో గంధర్వకన్యలకు సరితూగగలదు! పేరేమి టన్నావు? ఇంకా పెళ్ళి కాలేదు గదా?" అన్నాడు, తనకు చావు తప్పవచ్చు అన్న ఆశతో.

"పేరు చతురసుందరి! ఆ పెళ్ళి గొడ వల వల్లే, ఆ కోన వదిలాం. అక్కడ వున్న కుర్రరాక్షస ముచ్చుగాళ్ళందరూ, చతుర సుందరి నాదంటేనాదని దొమ్మియుద్ధాలు ప్రారంభించారు. ఇలా అయితే, భైరవకోన లోని రాక్షసజాతే నశించిపోతుందని ఇటు పారిపోయి వచ్చాం," అన్నది ముసలి రాక్షసి.

భైరవశాస్త్రి ఆకాశంకేసి చేతులు జోడించి, "ఆహాఁ, విధిలీలలు తెలియ తరమా?" అంటూ ఒక క్షణం కళ్ళుమూసు కుని తెరిచి, "మన చతురసుందరికి తగిన వరుడు, ఇక్కడికి ఆమడదూరంలో వున్న కీకారణ్యంలో వున్నాడు. నువ్వు సరే నంటే, అతడిచేత సరేననిపిస్తాను," అన్నాడు.

ఆమాటలకు ముసలిరాక్షసి ఆనంద పడుతూ, "అరే ఒరే నరమనిషీ, నీ వెంత మంచివాడివి! ఈపెళ్ళికుదిర్చావంటే, నీకు వెలలేని మణి మాణిక్యాలిస్తాను," అన్నది.

"నాకు నీ కారణంగా ధనప్రాప్తే కాక, పెళ్ళికుదిర్చిన పుణ్యంకూడా దక్కబోతు న్నది, వస్తాను!" అంటూ భైరవశాస్త్రి అక్కడి నుంచి బయల్దేరి, కొద్ది దూరం వైదేహీ రాజ్యంకేసి నడిచి, ఒక చెట్టుకిందకూర్చుని ఆలోచనలో పడ్డాడు.

కొంతసేపయ్యాక భైరవశాస్త్రి ఒక నిర్ణ యానికి వచ్చాడు. తన దురాశే గాని కోసల, వైదేహీ రాజుల మధ్య వియ్యం కలపడం సాధ్యమయ్యే పనికాదు. ఈ ముసలి రాక్షసిని మంచిచేసుకున్నట్టే, ఆ కీకారణ్యపు రాక్షసుణ్ణికూడా మంచి చేసు కుంటే బోలెడంత ధనం!

అతడు అక్కడినుంచి లేచి, వేగంగా నడిచి కీకారణ్యం ప్రవేశించాడు. అక్క డుండే రాక్షసుడి గుహ తెలుసుకోవడం భైరవశాస్త్రికి ఏమంతకష్టం కాలేదు. ఒక చోట జంతువుల కళేబరాలూ, అస్థిపంజ రాలూ కుప్పలు తెప్పలుగా పడివున్నవి. ఆ దాపునే పెద్దగుహ వున్నది.

భైరవశాస్త్రి తన ఇష్టదైవాన్ని ఒకసారి స్మరించుకుని, నిబ్బరంగా గుహముందుకు పోయాడు. రాక్షసుడు గురకపెట్టి నిద్రపో తున్నాడు. భైరవశాస్త్రి పెద్దగొంతుతో,



"రాక్షస ప్రభూ! నేను భైరవశాస్త్రిని, తమకు మేలుచేయడానికి వచ్చాను!" అన్నాడు.

ఆ వెంటనే రాక్షసుడు కళ్ళు తెరిచి లేచి కూర్చుని, "నా అంత రాక్షసుణ్ణి కేక వేసి నిద్రలేపే నీ సాహసాన్ని మెచ్చాను. ఇందుగ్గాను గుహ మూలవున్న రత్నరాసుల్ని నీ కివ్వాలని వున్నది. కాని ఏం లాభం; వాటిని అనుభవించడానికి ఒక గంట తర్వాత నువ్వీ లోకంలో వుండవు!" అన్నాడు.

ఆ మాటలు భైరవశాస్త్రికి భయం కలిగించినా అది బయటపడకుండా, "రాక్షస ప్రభువుల మెచ్చుకోలుకు చాలా కృతజ్ఞుణ్ణి. మేలు చేయవచ్చిన వాడికి కీడు చేయకూడదన్నది రాక్షస సంప్రదాయం కదా! ఇంకా నిద్రనుంచి బాగా తేరుకోని కారణంగా, ఆసంగతి తమస్ఫృహకు ఇంకా అంది వుండదు," అన్నాడు.

ఆ మాటలకు రాక్షసుడు పెద్దగానవ్వి, "ఆహాఁ, ఏమిరా నీమాటకారితనం, భైరవా సరే, ప్రాణాలకు తెగించి ఇంత దూరం వచ్చావు. ఆ మేలేమిటో చెప్పు," అన్నాడు.

"తమరు పెళ్ళాడేందుకు వధువును సిద్ధపరిచి వచ్చాను," అన్నాడు భైరవశాస్త్రి చిన్నగా నవ్వి.

"పెళ్ళా! వధువా! నిజమా వేళాకోళమా? ఈ ఘంటాకంఠుడి జాతకంలో, ఆయోగం లేదనుకున్నానే!" అంటూ ఆశ్చర్యపోయాడు రాక్షసుడు.

"ఘంటాకంఠ ప్రభూ! జాతకాలు కూడా సమయ సందర్భాల ప్రభావంవల్ల మారుతుంటవనేది, కేవలం అశాస్త్రీయం కాదు. ఇంతకూ నేను వచ్చినపని ఇది!" అంటూ భైరవశాస్త్రి, ముసలిరాక్షసిగురించీ, ఆమె కూతురు చతురసుందరి గురించీ గొప్పగా చెప్పాడు.





ఇది విన్న రాక్షసుడు సంతోషంతో ఉక్కిరి బిక్కిరైపోయి, "ఓహూ, పద పద! నాభుజాలెక్కికూర్చో. ఆ చిట్టడవికి తొందరగా చేరవచ్చు," అంటూ భైరవ శాస్త్రిని వేగిరపెట్టాడు.

భైరవశాస్త్రి గుహమూల మెరుస్తున్న రత్నాలకేసి ఆబగాచూస్తూ, "రాక్షస ప్రభూ! ఈ మధ్య మనుషులు ధన విత్తాదుల కోసం ఎంతటి సాహసమైనా చేస్తున్నారు. జాగ్రత్త కోసం, ఆ రత్నాలను మూటగట్టి వెంట తెమ్మని సెలవా!" అన్నాడు.

"రాక్షసుడి గుహకు దొంగలు రావడమా! తెలివి మంతుడివిరా, భైరవం! ఆ రత్నాలను వెంటతేవడం కాదు, ఆ పెళ్ళేదో అయ్యాక వెంట తీసుకుపో," అన్నాడు రాక్షసుడు గుహ ప్రతిధ్వనించేలా నవ్వుతూ.

భైరవశాస్త్రి పైపంచలో రత్నాలను మూట గట్టి రాక్షసుడి భుజాలెక్కాడు. చీకటి పడబోతూండగా ఇద్దరూ, చిట్టడవిలో ముసలిరాక్షసీ, కూతురూ వున్న ప్రాంతం చేరారు.

అంతదూరాన ఘంటాకంఠుణ్ణిచూస్తూనే ముసలిరాక్షసి కూతురు చతురసుందరి తల్లితో, "పెళ్ళికొడుకు చీకటిపడక ముందు రావడం మంచిదయింది! లేకపోతే, అతడి రూపాన్ని గుర్తించడం సాధ్యపడేది కాదు," అన్నది సిగ్గుతో మెలికలు తిరిగిపోతూ.

ఇందుకు ముసలిరాక్షసి పొట్ట చెక్కల య్యేలా నవ్వి, "కారునలుపనా, నువ్వనేది? మనం ఎక్కువగా వేటాడేది, రాత్రి వేళల్లో గదా! తెల్లరాక్షసుడెవడైనా వుంటే, వాడు వేట దొరక్క మాడిపోతాడు," అన్నది.

అంతలో అక్కడికి రాక్షసుడూ, భైరవ శాస్త్రీ వచ్చారు. రాక్షసుడు, చతురసుందరిని చూస్తూనే "ఆహాఁ! ఏమందం! రాక్షసిరూపంలోవున్న మోహినిలా వున్నది. నాకీ పెళ్ళి ఇష్టమే," అన్నాడు.

ముసలిరాక్షసి, కూతుర్ని, "మరి నీ సంగతేమిటి?" అని అడిగింది.

"భర్త ఇష్టమేకదా, భార్యఇష్టం," అంటూ చతురసుందరి రెండడుగులు వెనక్కు వేసింది.

ముసలిరాక్షసి, కూతురి చేయి పట్టుకుని తీసుకువచ్చి, ఘంటాకంఠుడి ముందు నిలిపి, ఇద్దరిచేతులూ కలిపింది.

"కరగ్రహణం జరిగింది. పెళ్ళి జరిగి పోయినట్టే," అంటూ భైరవశాస్త్రి చప్పట్లు చరిచి ముసలిరాక్షసితో "రాక్షసమ్మా!నాకిస్తా

నన్ను బహుమానం మరవలేదు కదా?" అన్నాడు.

"మరవడమా!" అంటూ ముసలి రాక్షసి మణిమాణిక్యాలున్న మూటను తెచ్చి, భైరవశాస్త్రికిచ్చింది.

రాక్షసుడిచ్చిన రత్నాల మూటను ఒక భుజానికీ, రాక్షసి ఇచ్చిన మణిమాణిక్యాలమూటను రెండవభుజానికీ వేళ్ళాడ వేసుకుని, భైరవశాస్త్రి వాళ్ళకు చేతులు జోడించి నమస్కరించి తల ఎత్తి ఆకాశం కేసి చూసి రాక్షసుడితో, "రాక్షస ప్రభూ! మీరిప్పుడు ఒంటరి వారు కాదు; సకుటుంబీకులు. రాజద్రోహమని ఎరిగీ మీకొక రహస్యం చెబుతున్నాను. తన రాజ్యపు అరణ్యంలో చేరి జంతువులనే కాక, రాజ్య పౌరులను కూడా విచ్చలవిడిగా చంపి తినేస్తున్న మీ మీదికి, మా మహారాజుగారు పెద్ద సైన్యంతో దాడి చేయనున్నారు. కనుక, ఈనాటి మిడిరేయి వేళ, ముగ్గురూ రాజ్యం విడిచి భైరవ కోనకు కాకపోతే, శార్దూలలోయకు ప్రయాణించడం మేలవుతుంది!" అన్నాడు.

ఆ వెంటనే ఘంటాకంఠుడు పెద్దగా హుంకరించి, కాళ్ళతో గట్టిగా నేలనుతాటిస్తూ, "మానవమాత్రులకు వెరచి, నేను నా గుహను వదిలి పారిపోవడమా? ఛీ!" అన్నాడు.

అప్పుడు భైరవశాస్త్రి వినయంగా, "రాక్షస ప్రభూ! తమరు పారిపోవడంలేదు. కుటుంబం పెరిగింది గనక, ఇరకాటంగా వున్న గుహను విడిచి, కాస్త సౌకర్యంగా వుండే గుహకోసం, కోసలరాజ్య సరిహద్దులు దాటి ప్రయాణం చేయబోతున్నారు. అంతేగదా, రాక్షసమ్మా?" అంటూ ముసలి రాక్షసికేసి చూశాడు.

వెంటనే ముసలిరాక్షసి, "భైరవం సలహా బావుంది! కదలండి," అంటూ అక్కడి నుంచి బయలుదేరింది.

[illegible] వెనగ్గా కూతురూ, తలవంచుకుని [illegible] వెనక రాక్షసుడూ కదిలారు. భైరవశాస్త్రి భుజాలనుంచి వేళ్ళాడుతున్న ధనపు సంచులబరువుకు ఆయాసపడుతూ, "దారిద్ర్య భారమే కాదు, ఒక్కొక్కసారి ధనభారం కూడా ఆయాస పెడుతుంది!" అని నవ్వుకుంటూ ఇంటిదారి పట్టాడు.



# ఉత్తమకావ్యం!

హేలాపురిలో కవులకు ఆదరణ ఎక్కువగా వుండేది.ప్రసిద్ధకవుల పేరుప్రఖ్యాతులు చూసి తాము కూడా కవిత్వం రాసి, మహారాజు నుంచి ఆదరణ పొందాలనే ఆశతో, ఏమాత్రం పాండిత్యం లేనివారు కూడా కవిత్వం రాయడం మొదలుపెట్టారు.

ఆస్థానకవి కులశేఖరుడి వద్దకు ప్రతిదినం కవులు, తమ కావ్యాలతో వచ్చి రాజుగారి ప్రాపకం కోరేవారు.

హేలాపురికి ఆమడదూరంలో వున్న సుగంధపురిలో, కొందరు ప్రముఖ కవులతో పాటు కవితా శూన్యులు కూడా వుండేవారు. అటువంటి వారిలో మేటి అనదగిన కుమారభట్టు, తను రాసిన రెండు కావ్యాలను తీసుకుని కులశేఖరుణ్ణి దర్శించాడు.

ఆ రెండు కావ్యాలలో ఉత్తమమైన దాన్ని ఎంపిక చేయించి, మహారాజుకు అంకితం ఇవ్వాలన్నది కుమారభట్టు కోరిక. ఇందుకు కులశేఖరుడు తన అంగీకారం తెలియబరిచాడు. కుమారభట్టు మహదానందం చెంది,తనమొదటి కావ్యాన్ని చదివి వినిపించాడు, కులశేఖరకవికి.

రెండుగంటల పాటు ఎంతో సహనంతో, కుమారభట్టు కావ్యపఠనాన్ని విన్న కులశేఖరుడు, అతడు రెండో కావ్యాన్ని వినిపించబోతుంటే వారించి, "కవివర్యా! తమ రెండో కావ్యాన్ని వినిపించనవసరం లేదు.రెండుకావ్యాల్లో అదే ఉత్తమోత్తమమైన కావ్యం అయివుంటుంది!"అన్నాడు.

ఆ మాటతో కుమారభట్టు, తన పాండిత్య ప్రతిభ ఏపాటిదో గ్రహించి, కులశేఖరుడికి నమస్కరించి, ఇంటిదారి పట్టాడు.

**– కోనే నాగవెంకట ఆంజనేయులు**





# సామ్రాట్ అశోక

## 11

[పాటలీపుత్రంలో రాజు బిందుసారుడి ఆరోగ్యం ఆందోళనకరంగా పరిణమించింది. తక్షశిలలో వున్న సుశేముణ్ణీ, ఉజ్జయినిలోవున్న అశోకుణ్ణీ వెంటనే బయలుదేరి రమ్మని ప్రధానమంత్రి దూతలనుపంపాడు. సుశేముడి ప్రయాణాన్ని ఆలస్యంచేయించడానికి అశోకుడి మిత్రుడు యశుడు ఇద్దరు నాట్యకత్తెలను తక్షశిలకు పంపాడు. యశుడు ఉజ్జయినికి తిరిగి వచ్చి, జ్యోతిష్కుడిలా అక్కడికివచ్చిన సుశేముడి మిత్రుడి కుట్రనుబట్టబయలు చేశాడు. పాటలీపుత్రం నుంచి కబురు అందగానే, కొంతసైన్యంతో బయలుదేరాలని యశుడు అశోకుణ్ణి ఒప్పించాడు. —[తరవాత]

అశోకుడు పాటలీపుత్రానికి బయలుదేరడానికి సిద్ధమవుతూ, ఆ విషయం తెలియజేయడానికి దళనాయకులను పిలిపించాడు. దళనాయకులను ఉద్దేశించి యశుడు ఇలా అన్నాడు:

"మిత్రులారా! మనమందరం మన కర్తవ్యాలను నిర్వర్తించవలసిన సమయం సమీపించింది. అది మగధ సామ్రాజ్య భవిష్యత్తునే నిర్ణయిస్తుంది.చంద్రగుప్త మౌర్యుడు స్థాపించిన సామ్రాజ్యం మన కళ్ళెదుటే విచ్ఛిన్నం కావడం చూస్తూ, చేతులుకట్టుకుని కూర్చోవడమా? లేక దక్షతతో ముందుకు ఉరికి దానిని పరిరక్షించడమా? అన్నదే మనం ఇప్పుడు నిర్ణయించుకోవాలి!"

"సామ్రాజ్య రక్షణకు మనం పోరాడాలి. మాకు మన యువరాజు పట్ల, ఆయనకు ఆప్తమిత్రుడైన మీ పట్ల అచంచలమైన



విశ్వాసం ఉన్నది. అది సరే; ఇప్పుడు మగధ సామ్రాజ్యానికి ముంచుకు వచ్చిన ఆపద ఏమిటి? దాని శత్రువు లెవరు?" అన్నాడు అవంతీ సర్వసేనాధ్యక్షుడు.

"మిత్రులారా! మీరు రాజ్యానికి వెలుపలవున్న శత్రువులతో అనేకసార్లు పోరాడి ఉండవచ్చు. ఇప్పుడు మనం రాజ కుటుంబంలోనే ఏర్పడిన అంతశ్శత్రువులతోనూ, వాళ్ళతో చేతులు కలిపిన స్వార్థపరులతోనూ పోరాడాలి. వీళ్ళు బాహ్యశత్రువులకన్నా భయంకరులు. బాహ్యశత్రువులతో పోరాడడానికి ధైర్యం వుంటే చాలు. అంతశ్శత్రువులను అదుపు చేసి అంతమొందించడానికి ధైర్యంతో పాటు అచంచలమైన విశ్వాసం, చిత్తశుద్ధి కావాలి! లక్ష్యం ఉన్నతంగా ఉన్నప్పుడు హృదయాలలో అచంచలమైన విశ్వాసం ఏర్పడుతుంది. సరే, మహారాజు తరవాత మగధ సింహాసనాన్ని ఎవరు అధిరోహించగలరని మీరు భావిస్తున్నారు?" అని అడిగాడు యశుడు.

కొంతసేపు మౌనం తరవాత సేనాధ్యక్షుడు, "యువరాజు సుశేముడికి రాజ్యాభిషేకం చేయాలని మహారాజుగారు నిర్ణయించినట్టు కొందరు మిత్రుల ద్వారా విన్నాను. అయితే అలా జరగకూడదని నేను ఆశిస్తున్నాను," అన్నాడు.

"ఎందుకలా ఆశిస్తున్నావు?" అని అడిగాడు యశుడు.

"యువరాజు సుశేముడు దుర్మార్గుడే కాదు; పరమ మూర్ఖుడుకూడా. ఒకప్పుడు నేనాయనకు ఒక చురుకైన సైనికుణ్ణి అంగరక్షకుడిగా పంపాను. వాడు దాపుల నిలబడి వుండగా – ఏదో ఎగురుతూన్న పక్షి తన తలపాగా మీద రెట్టవేసిందని, సుశేముడు ఆ అంగరక్షకుడికి మరణశిక్ష విధించాడు. అటువంటి దుందుడుకు స్వభావంగల మూర్ఖుడు రాజైతే, ప్రజల పరిస్థితిని ఊహించలేకుండా ఉన్నాను," అన్నాడు సేనాధ్యక్షుడు బాధగా.

"అలాంటప్పుడు అతన్ని రాజ్యాధికారానికి రానీయకుండా మన ప్రయత్నం మనం చేయాలి కదా! మరొక్క విషయం. యువరాజు అశోకుడు మగధ సింహాసనం అధిష్ఠించడానికి అర్హుడా? కాదా?" అని అడిగాడు యశుడు.

"అన్నివిధాలాఅర్హుడు! అశోకుడే మగధ మహారాజుకావాలి!"అన్నాడు సేనాధ్యక్షుడు.

అతని అభిప్రాయాన్ని మిగిలిన దళనాయకులు ఆనందోత్సాహాలతో ఆమోదించారు.

"మంచిది! మీ న్యాయమైన కోరికను అభినందిస్తున్నాను. అయితే, మనకు న్యాయమైన కోరిక ఉన్నంతమాత్రాన, ఊరుకుంటే అదినెరవేరదు. దానిని సాధించడానికి శాయశక్తులా పోరాడాలి. యువరాజు అశోకుడు మగధ సింహాసనం అధిష్ఠించాలంటే – అందుకుమనం మన ఖడ్గబలంతో రాజమార్గం నిర్మించాలి! దానికెంతో ధైర్యసాహసాలు కావాలి! త్యాగం చేయాలి. అందుకు మీరుసిద్ధంగాఉన్నారా?" అనిఅడిగాడు యశుడు ఆవేశంగా.

"యువరాజుకోసం ప్రాణాలర్పించడానికైనామేము సిద్ధంగా ఉన్నాం?" అన్నారు దళనాయకులందరూ ఏకకంఠంతో.

యువరాజు అశోకుడు అప్పుడే అక్కడికి వచ్చాడు.

"కాబోయే మగధ మహారాజు యువరాజు అశోకులవారికి నమస్కారం!" అన్నాడు సేనాధ్యక్షుడు. మిగతా దళనాయకులు అశోకుడికి తలలువంచి నమస్కరించారు.

"ఇక ఒక్క క్షణం కూడా ఆలస్యం చేయకూడదు. ఇక్కడ ఏఏ దళనాయకులు ఉండాలో సేనాధ్యక్షుడే నిర్ణయించాలి. అవసరమైతే వాళ్ళు పోరాడి రాజభవనాన్ని రక్షించవలసివుంటుంది. మిగిలిన వాళ్ళందరూ తమ దళాలతో తెల్లవారకముందే యువరాజు వెంట పాటలీపుత్రానికి బయలుదేరాలి!" అని ఆజ్ఞాపించాడు యశుడు.



దళనాయకులు అంగీకార సూచకంగా చేతులు పైకెత్తారు.

"మిత్రులారా! మా పితామహుడు స్థాపించిన మగధ సామ్రాజ్య సంరక్షణ కోసం, ఈ క్లిష్ట పరిస్థితులలో మీరు అందజేస్తున్న సహకారాన్ని, నేనెన్నడూ మరువను," అన్నాడు అశోకుడు.

* * *

"ప్రభూ! మహారాజుగారు మరణించారు?" అంటూ ఒక దూత లోపలికి వచ్చాడు.

ఆ గదిలో ఇద్దరు గ్రీకువర్తకులతో కలిసి మద్యం సేవిస్తున్న యువరాజు సుశేముడు ఇబ్బందిగా చూస్తూ తలపైకెత్తాడు. వాళ్ళ ముందున్న మేజా మీద పెద్ద వజ్రం వింతకాంతులు వెదజల్లుతున్నది.



"ఈ వార్తను తెచ్చినందుకు బహుమతిగా నీకీ వజ్రాన్ని ఇస్తాననుకుంటున్నావా? నిన్ను ఇక్కడికి అనుమతించిందెవరు?" అన్నాడు సుశేముడు తన ఆనందానికి అంతరాయం కలిగిందన్న ఆగ్రహంతో.

"తమరే అనుమతించారు ప్రభూ!" అన్నాడు అక్కడే నిలబడిన సుశేముడి ఆంతరంగిక సలహాదారు సుబాహుడు.

"అలాగా!" అంటూ సుశేముడు కొంత స్థిమితపడి, "నా తండ్రి మరణించాడా?" అన్నాడు.

"అవును, ప్రభూ! ప్రధానమంత్రి నుంచి వచ్చిన వర్తమానం ఇక్కడే ఉన్నది?" అన్నాడు సుబాహుడు.

"ప్రధానమంత్రి! నేను రాజుగా పట్టాభిషిక్తుడైన మరుక్షణమే ఆ ఖల్లాటకుణ్ణి దాపులనున్న తటాకంలో ముంచి చంపుతాను," అంటూ లేచినిలబడిన సుశేముడు గ్రీకువర్తకులకేసి తిరిగి, "సరే! తరవాత కలుద్దాం!" అన్నాడు.

ఇద్దరు వర్తకుల చూపులూ ఒక్కసారిగా మేజా మీదవున్న వజ్రంమీద పడ్డాయి. తక్షశిలలో వ్యాపారం చేసుకోవడానికి అనుమతించగలడన్న ఆశతో, వాళ్ళు సుశేముడికి విలువైన వజ్రాన్ని బహుమతిగా ఇచ్చారు. కాని దానికి సంబంధించిన ఆనతి ఇంకా జారీకాలేదు.

సుశేముడు ఆవజ్రాన్ని చేతిలోకి తీసుకుని; "మరికొన్ని వజ్రాలతో పాటలీపుత్రానికిరండి. తక్షశిలలో మాత్రమేకాదు; మగధ దేశమంతటా వర్తకం చేసుకునే హక్కును మీకు ఇస్తాను," అంటూ పకపకా నవ్వాడు.

వర్తకులు మౌనంగా నిలబడ్డారు.

"నా మాటలు మీకు అర్థంకాలేదా?" అన్నాడు సుశేముడు మెరుస్తూన్న కళ్ళతో.

"తమ పట్టాభిషేకం నిరాటంకంగా జరిగిపోవాలని ఆశిస్తున్నాము, ప్రభూ!" అన్నారు వర్తకులు.

"ఇప్పుడే నేను పాటలీపుత్రానికి బయలుదేరాలి. సుబాహూ! మన దళనాయకులను రప్పించు," అన్నాడు సుశేముడు.

"సైన్యంతో వెళ్ళడం ఉత్తమం!" అన్న మాటలు వెనకనుంచి వినిపించాయి.

సుశేముడు తలత్రిప్పి చూశాడు. ఆమాట అన్నవాడు పాటలీపుత్రంలోని అతని ప్రధాన గూఢచారి.

"ఏమిటా తొందర? ఎందుకలా రొప్పుతున్నావు?" అని అడిగాడు సుశేముడు.

"ప్రభూ! నేను ఇప్పుడే పాటలీపుత్రం నుంచి వస్తున్నాను. యువరాజు అశోకుడు పాటలీపుత్రం చేరుకోనున్నాడు!" అన్నాడు గూఢచారి.

"అర్థరహితంగా వాగకు! నువ్వంటూన్న యువరాజు అశోకుడు కదలలేనిమాంసపు ముద్దగా, లేచి నిలబడడానికి కూడా వీలు కాకుండా ఉజ్జయినిలో అవస్థపడు తున్నాడు!" అన్నాడు సుశేముడు హేళనగా.

"ప్రభూ! ఆయన సైన్యంతో గుర్రాల మీద రాజధానికేసి దూసుకు వెళ్ళడం నేను నా కళ్ళారా చూశాను!" అన్నాడు గూఢచారి.

"నిజంగానా!" అన్నాడు సుశేముడు ఇంకా నమ్మలేనట్టు.

"నా మాటలలో అవలేశం అబద్ధం వున్నా, నన్నూ ఖల్లాటకుడితో పాటు నీళ్ళ లోకి తోసి చంపండి.!" అన్నాడు గూఢచారి.

"అయితే..." అంటూ సుశేముడు సుబాహుడికేసి చూశాడు అసహనంగా.

"చెప్పండి, ప్రభూ!" అన్నాడు సుబాహు ఒక అడుగు ముందుకు వేసి.

"ఉజ్జయిని నుంచి వచ్చిన ఆ యువ తులు ఎక్కడ? సుబాహూ వాళ్ళను వెంటనే ఇక్కడికి తీసుకురా!" అని ఆజ్ఞాపించాడు.

"వాళ్ళెక్కడున్నారు ప్రభూ!" అని అడిగాడు సుబాహుడు.

"అది, నాకెలా తెలుసు? నా దగ్గర బహుమతి పుచ్చుకుని తరవాత వస్తామని చెప్పి వెళ్ళారు. ఈ నగరంలోనే ఎక్కడో ఉంటారు. మన భటులు వెదికి పట్టుకో లేరా?" అన్నాడు సుశేముడు.



అంతలో మరొక భటుడు వచ్చి సుశే ముడికి నమస్కరించాడు. వాడు ఉజ్జయి నిలో వున్న సుశేముడి గూఢచారి. వాణ్ణి చూడగానే, "ఆహా! సమయానికి వచ్చావు. అశోకుడు పాటలీపుత్రానికి బయలుదేరా డని చెప్పడానికికాదుకదా నువ్వువచ్చింది!" అని అడిగాడు సుశేముడు ఉత్కంఠతతో.

"అంటే, ప్రభువులవారికి ఈ వార్త ముందే అందిందన్న మాట! అశోకుడు అటు పాటలీపుత్రానికి బయలుదేరగానే నేనుఇటు తక్షశిలకు వచ్చాను," అన్నాడు గూఢచారి.

"అశోడు పక్షవాతం పాలుకాలేదా?" అన్నాడు సుశేముడు ఆవేశంగా.

"పక్షవాతమా! ఆయన మునుపటికన్నా ఇప్పుడుఎంతో ఆరోగ్యంగా, ఉత్సాహంగా



గుర్రం మీద బయలుదేరాడు, ప్రభూ!" అన్నాడు గూఢచారి.

"చాలు, నోర్ముయ్! ఆ మోసకత్తెలను పట్టుకురండి! కోసి కాకులకూ, గద్దలకూ ఆహారంగా వేయండి.నిలువునా నిప్పుల్లో తగలబెట్టండి! గొంతు నులిమి చంపండి!" అంటూ పట్టరానిఆవేశంతో మతిచలించిన వాడిలా కేకలువేయసాగాడు సుశేముడు.

***

సూర్యుడు పడమటి కొండలను చేరు కుంటున్నాడు. రాజు బిందుసారుడి భౌతిక కాయాన్ని దహనంచేయడానికి నదీ తీరా నికి తీసుకువచ్చారు. ఆయన కుమారు లలో ఆరుగురు అక్కడే ఉన్నారు. రాజు గారి చితికి నిప్పంటించేదెవరో ఇంకా నిర్ణయం కాలేదు.

"ఆరుగురు కుమారులకూ ఆపనిని అప్పగించవచ్చా?" అని అడిగాడు సేనాధి పతి ప్రధానమంత్రిని.

"అశోకుడు నగరాన్ని సమీపించాడని నాకు వర్తమానం అందింది. సుశేముడి తరవాత ఆయనే అర్హుడైన యువరాజు గనక, ఆయనే చితికి నిప్పంటించడం న్యాయమని నేను భావిస్తున్నాను" అన్నాడు ప్రధానమంత్రి.

"అవును, అదే ధర్మ సమ్మతం!" అన్నాడు పురోహితుడు.

"అదిగో యువరాజు అశోకుడు వచ్చే శాడు!"అన్నారు దూరంగా నిలబడినప్రజలు.

"యువరాజు అశోకుడు వర్ధిల్లాలి!" అని మిగతావాళ్ళు నినాదాలు చేశారు.

అప్పటికే అక్కడున్న ఆరుగురు రాకు మారులు అదృశ్యమయ్యారు.కొంతసేప టికి దూరంగా కలకలం బయలుదేరింది.

"ఏమిటది?" అని అడిగాడు ప్రధాన మంత్రి.

"రాకుమారులుఆరుగురి ఆజ్ఞప్రకారం, కొందరు సైనికులు యువరాజు అశోకుణ్ణి ఇక్కడికి రానీయకుండా అడ్డుకుంటు న్నారు" అని చెప్పాడు అక్కడికి పరుగెత్తుకు వచ్చిన ఒక రాజోద్యోగి.

సేనాధిపతి దాపులనున్న ఎత్తయిన ప్రదేశాన్ని చేరి, "మన సైనికులెవ్వరూ యువరాజు అశోకుణ్ణి అడ్డుకోకండి! అలా చేసిన వారికి మరణశిక్ష తప్పదు!" అని హెచ్చరించాడు.

అయినా, అంతకు ముందే రాజకు మారులు, కొందరు దళనాయకులకు

లంచమిచ్చి వశపరచుకుని వుండడం వల్ల, ఆ దళనాయకుల కింది సైనికులు, అశోకుడికి అడ్డుపడడానికి ప్రయత్నిం చారు. అశోకుడి వెనక బలమైన సైన్యం వస్తూన్న విషయం వాళ్ళెరుగరు!

"యువరాజు అశోకుడికి అడ్డుపడే వాళ్ళందరినీ హతమార్చండి!" అని ఆజ్ఞా పించాడు యశుడు.

"యువరాజు అశోకుణ్ణి రక్షించాలని మన సైనికులను ఆజ్ఞాపిస్తున్నాను!" గట్టిగా అరిచాడు సేనాధిపతి.

"దహన సంస్కారానికి తగిన సమయం ఆసన్నమయింది, ఇప్పుడేంచేయడానికీ తోచడం లేదు!" అన్నాడు పురోహితుడు.

అంతలో అశోకుడు అక్కడికి వచ్చాడు!

"యువరాజులవారికి స్వాగతం! ఈ సమయంలో తమరు ఇలాంటి పరిస్థితిని ఎదుర్కోవలసిరావడంవిచారకరం!అయినా, అదృష్టవశాత్తు నిరపాయకరంగా బయట పడ్డారు.అంతేచాలు!"అన్నాడుప్రధానమంత్రి.

"మండుతూన్న కాగడాను అందుకుని మీ తండ్రిగారి చితికి నిప్పంటించండి!" అన్నాడు రాజపురోహితుడు.

కొన్ని నిమిషాలలో ఆ తంతు పూర్త యింది!

"సింహాసనం ఖాళీగా ఉండకూడదు. రాజుగారిచితికి నిప్పంటించిన వారే సింహా సనానికి వారసులవుతారు. ఈ రాత్రికే తమ మకుటాభిషేకం జరగాలి. కావలసిన ఏర్పాట్లుచేశాను!" అన్నాడు ప్రధానమంత్రి.

"నేను పరిపాలనాధికారాన్నిచేపడతాను. అయితే, మకుటాభిషేకోత్సవం అప్పుడే వద్దు. నేను మహారాజు కావడానికి రాజోద్యో గులూ, ప్రముఖులూ, సామంతులూ సుము ఖంగా ఉన్నారా- అని మొదట తెలుసుకో వాలి!" అన్నాడు అశోకుడు గంభీరంగా.

"ఉన్నతమైన మీ మనోప్రవృత్తిని మీ మాటలు చాటుతున్నాయి!" అన్నాడు ప్రధానమంత్రి.

అశోకుణ్ణి హతమార్చడానికి వచ్చిన వాళ్ళందరూ హతులయ్యారని తెలియ డానికి మరొక గంటసేపు పట్టింది. హతు లైన వారిలో ఆరుగురు రాకుమారులూ ఉన్నారు. రాజభవనం అంతటా శోకం అలముకున్నది. రాణులూ, పరిచారికలూ దీనంగా విలపించసాగారు! - (ఇంకావుంది)





# గురుదక్షిణ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, ఈ అర్ధరాత్రివేళ, శయనాగారంలోని హంసతూలికా తల్పం మీద సుఖనిద్రలో వుండవలసిన నువ్వు, విషసర్పాలూ, గూబలూ, భూతప్రేతాలూ తిరిగే ఈ శ్మశానంలో, ఇన్ని శ్రమలను ఎలా ఓర్చగలుగుతున్నావో అర్థం కావడం లేదు. ప్రాణమిత్రుడూ, సాటిరాజూ, విద్య నేర్పిన గురువూ-ఇలాంటి వారిలో ఎవరైనా, నీ ద్వారా తమ స్వకార్యం సాధించుకో చూస్తున్నారేమో తెలియదు. ప్రాణమిత్రుడూ, సాటిరాజూ కోసమైతే, ఇంతపట్టుదల వహించడాన్ని తప్పుపట్టలేము. కాని, విద్యాబోధచేసిన గురువుకోసమైతే మాత్రం, నువ్వు మరొకసారి సందార్భాసందర్భాలను

## బేతాళ కథలు




గురించి ఆలోచించడం వివేకమనిపించు కుంటుంది. ఎందువల్లనంటే - విద్యబోధించిన గురువుకు, ప్రతిశిష్యుడూ విద్య పూర్తికాగానే గురుదక్షిణ సమర్పిస్తాడు. ఆతర్వాత గురువు ఏదైనాకోరడం, శిష్యుడు దానికోసం శ్రమించడం వివేకమనిపించు కోదు. అంతేకాక, కొందరు బోధకులు అసూయాపరులూ, మత్సర మతులూ. ఇందుకు ఉదాహరణగా, ఉపాసకుడనే గురువు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్ప సాగాడు:

ఒకానొకప్పుడు బదరికవనంలో పేరెన్నికగాంచిన గురుకులముండేది. ఉపాసకుడు అక్కడ గురువు. ఆయన తన వద్దకు వచ్చిన ప్రతి ఒక్కరినీ శిష్యుడుగా స్వీకరించేవాడు. వారి వారి అభిరుచుల ప్రకారం విద్యాబోధన చేసేవాడు.

ఉపాసకుడివద్ద విద్యకు కాలపరిమితులుండేవి కాదు. శిష్యులు చదివినంత కాలం చదివి, తమకు తృప్తి కలగగానే సెలవు తీసుకునేవారు. కొందరు ఏడాది శిష్యరికంతోనే తృప్తిపడి వెళ్ళిపోతే, కొందరు ఏళ్ళ తరబడి విద్యాభ్యాసం చేస్తూనే వుండేవారు.

"చదువుకు ఆరంభమే తప్ప అంతం లేదు. గురువుగా నాకు తెలిసింది చెబుతూనే, ఇప్పటికీ నేను ఎన్నో కొత్త విషయాలు నేర్చుకుంటున్నాను. విద్యాభ్యాసమే నా జీవితలక్ష్యం కాబట్టి, నేను గురుకులాన్ని నడుపుతున్నాను. వారివారి జీవిత లక్ష్యాలను బట్టి ఎవరైనా ఎంతకాలం, ఎప్పుడు, ఎక్కడ ఏమి నేర్చుకోవాలో అన్నది నిర్ణయించుకోవాలి," అనేవాడు ఉపాసకుడు శిష్యులతో.

గురుకులంలో ఉన్నంతకాలం శిష్యులు కాయకష్టంచేయాలి. గురుకులానికి అవసరమైన పంట, కాయగూరలు, ఫలాలు, వసతి సౌకర్యాలు, సమస్త సదుపాయాలూ శిష్యులే ఏర్పాటుచేయాలి. శిష్యుల కాయకష్టమే తనకు గురుదక్షిణ, అనేవాడు ఉపాసకుడు.

ఇలావుండగా, ఒకసారి ఉపాసకుడి వద్దకు కొత్తగా రంజనుడు, భంజనుడు అనే ఇద్దరు శిష్యులు వచ్చారు. వారాయనతో, "గురువర్యా! మేము ప్రత్యేకంగా వైద్యవిద్య నభ్యసించాలని మీ వద్దకు వచ్చాము. వీలైనంత త్వరగా విద్యాభ్యాసం

పూర్తి చేయాలని, మాకోరిక. అందుకు తమ సహకారం కావాలి. మిగతా శిష్యుల కులా మమ్మల్ని కాయకష్టానికి నియోగించవద్దు. నిత్యం విద్యాభ్యాసంలోనే మునిగి తేలాలని, మా అభిమతం," అన్నారు.

ఉపాసకుడిందుకంగీకరించాడు. ఇది మరికొందరు శిష్యులకు కన్నెర్రగా మారి, గురువు దగ్గరకు వెళ్ళి, "శిష్యులందరికీ ఒకే న్యాయముండాలి. తమలో ఈ భేద భావం తగునా?" అని ఘోషపెట్టారు.

దీనికి ఉపాసకుడు నవ్వి, "రంజనుడు, భంజనుడు తొలినుంచీ కాయకష్టం చేసి జీవించారు. వారికిప్పుడు చదువుకోవాలని బుద్ధిపుట్టింది. కాయకష్టం గురించి తెలియని మీకు, కాయకష్టం కూడా విద్యాభ్యాసంలో ఒక భాగం. అది రంజనుడికీ, భంజనుడికీ అవసరంలేదు," అన్నాడు.

ఇందుకు శిష్యులు, "ఆరంభంలో కాయకష్టమే తమకు గురుదక్షిణ అన్నారు. ఇప్పుడు విద్యాభ్యాసంలో భాగ మంటున్నారు. మీమాటలు మాకు బొత్తిగా అర్థం కావడంలేదు. రంజనుడినుంచీ, భంజనుడినుంచీ మీరు గురుదక్షిణ తీసుకోరా?" అంటూ ఎదురు ప్రశ్నవేశారు.

"ప్రతి ఒక్కరి వద్దా గురుదక్షిణ తీసుకుంటాను. కాయకష్టం చేయని వారినుంచి, నేనాశించే గురుదక్షిణ సామాన్యంగా వుండదు. అది సామాన్యులివ్వనూ లేరు. విద్యాభ్యాసం పూర్తయ్యాక, కాయకష్టం చేయనందుకు రంజనుడు, భంజనుడు కూడా విచారిస్తారు," అన్నాడు ఉపాసకుడు.




తమ గురువు ప్రతి విషయాన్నీ లోతుగా ఆలోచిస్తాడని తెలిసిన శిష్యులు, ఈ సమాధానంతో తృప్తిపడి అక్కడినుంచి వెళ్ళిపోయారు.

మూడుసంవత్సరాలు గడిచాయి. ఒక రోజున రంజనుడు, భంజనుడు గురువు వద్దకు వెళ్ళి, "గురువర్యా! ఇంతవరకూ మేము నేర్చుకున్నది బ్రతుకుతెరువుకు సరిపోతుంది. మాకికసెలవిప్పించండి!" అన్నారు.

"మరి నాకు గురుదక్షిణ ఇవ్వకుండానే వెళతారా?" అన్నాడు ఉపాసకుడు.

శిష్యులిద్దరూ తబ్బిబ్బుపడి, ఏంకావాలో అడగమన్నారు.

"మిగతా శిష్యులకులాగే కాయకష్టం చేసివుంటే, అదేనాకు గురుదక్షిణ అయ్యేది.



కానీ మీరది చేయలేదు. నా వద్ద మూడు సంవత్సరాలు శుశ్రూషచేసి, మీరు నేర్చిన చదువు సామాన్యమైనది కాదు. మీరు మీమీ ఊళ్ళకువెళ్ళి వైద్యవృత్తిని ఆరం భించండి. సరిగ్గా ఏడాది ముగిశాక మీ వద్దకు వస్తాను. ఒక్కొక్కరు లక్షవరహా లివ్వాలి. అదే నేను కోరే గురుదక్షిణ," అన్నాడు ఉపాసకుడు.

"ఏడాదిలో లక్షవరహాలా? అది మావల్ల నవుతుందా?" అని ప్రశ్నించారు రంజ నుడు, భంజనుడు.

ఉపాసకుడు ఒక క్షణం ఆగి, "ఈ దేశపు రాజు ప్లవంగుడు, ఒక వింత జబ్బుతో బాధపడుతున్నాడు. ఆ వ్యాధికి మందు నింతవరకూ ఎవరూ కనిపెట్ట లేదు. ఈ ఆశ్రమంలో నేనూ, నా ప్రయత్నం చేస్తున్నాను. ఇప్పటి వరకూ ఫలితం కనిపించలేదు. ప్లవంగుడి జబ్బు నయం చేసిన వారికి లక్షవరహాల బహుమతి. మీ ప్రయత్నాలు మీరు చేయండి. పట్టు దల, కృషి వుంటే ఏదీ అసాధ్యం కాదు," అన్నాడు.

రంజనుడు తన ఊరైన భువనగిరి చేరుకున్నాడు. అక్కడి ప్రముఖ వైద్యుడు చండీదాసును కలుసుకుని, "మహారాజు ప్లవంగుడి జబ్బుకు మందు కనిపెట్టడానికి, నాకు మీసాయం కావాలి. బహుమానాన్ని చెరిసగం తీసుకుందాం!" అన్నాడు.

చండీదాసు, రంజనుడి వివరాలు తెలుసుకుని, "నువ్వు ఉపాసకుడి శిష్యు డివా? ఆయన కారణజన్ముడు. కాయకష్టా నికి భయపడి చాలామంది, ఆయనకు శిష్యరికం చేయాలనుకోరు. ఆయన వద్ద వైద్యం నేర్చుకున్నవారి హస్తవాసి గొప్పగా వుంటుందంటారు. నేను నీకు నా కూతు ర్నిచ్చి పెళ్ళిచేస్తాను. మనం జంటగా వైద్యం చేద్దాం. కనక వర్షం కురుస్తుంది," అన్నాడు.

అందుకు రంజనుడు సంతోషించినా, ప్లవంగుడి జబ్బు గురించి మరొకసారి అడిగాడు.

"అదొక వింత జబ్బు. దానికి మందు కనిపెట్టాలని లోగడ నేనూ అనుకున్నాను. కానీ వైద్యవిద్యలో ఏమందుకైనా గుణం తెలుసుకోవాలంటే, ముందుగా కొన్ని ప్రయోగాలు చేయాలిగదా! అలాంటి జబ్బు సామాన్యుడికెవరికైనా వచ్చివుంటే, ప్రయోగాలుచేసివుండేవాళ్ళం. రాజు మీదే ప్రయోగాలు చేయాలంటే, ఎవరికి ధైర్య

మంటుంది? ఎటుపోయి ఎటొచ్చినా తలపోతుంది. అందువల్లనే, ఎవరూ ఆ విషయమై ఆలోచించడంలేదు; మనమూ ఆలోచించవద్దు!" అన్నాడు చండీదాసు.

చండీదాసు కూతుర్ని పెళ్ళి చేసుకున్నాడు రంజనుడు. మామా అల్లుళ్ళిద్దరూ జంటగా వైద్యం ప్రారంభించారు. ఉపాసకుడి శిష్యుడిగా రంజనుడికి మంచి ప్రచారంచేశాడు, చండీదాసు. వాళ్ళ ఇంట నిలువెత్తు ఉపాసకుడి చిత్రపటం పెట్టారు. ఆయన గొప్పతనం గురించి వచ్చిన రోగులకు చెప్పేవారు. వైద్యానికి ముందా యన చిత్రపటానికి నమస్కరించుకోమనేవారు.

ఉపాసకుడిశిష్యుడిగా పేరుపడ్డ రంజనుడి వైద్యం, అన్నివేళలా సత్ఫలితాలనే ఇవ్వడంతో, అతడి ఆదాయం బాగా పెరిగింది. ఆరు మాసాలు తిరక్కుండానే, అతడు లక్షవరహాలుకూడబెట్టగలిగాడు.

ఈలోగా, భంజనుడు తన నగరమైన పవనగిరిచేరుకున్నాడు. ఆ సమయంలో అతడింటి పక్కన వుండే చందనుడనే యువకుడికి దయ్యంపట్టిందని, ప్రవాళుడనే భూతవైద్యుణ్ణి పిలిపించారు.

విషయం తెలుసుకున్న భంజనుడు, చందనుడి తల్లిదండ్రులను కలుసుకుని, "మీ అబ్బాయిని ఏదయ్యమూ పట్టలేదు. అతడిమెదడు కొన్ని రసాయనాల ప్రభావం వల్ల వెకిలిగా ప్రవర్తిస్తున్నది. నేను తగిన మందిచ్చి వారం రోజుల్లో, మీ అబ్బాయిని మామూలు మనిషిని చేయగలను," అని చెప్పాడు.




అయితే, చందనుడి తల్లిదండ్రులు భంజనుడి మాటలు నమ్మలేదు. వాళ్ళు ప్రవాళుడికి విషయం చెప్పి సలహా అడిగారు. ప్రవాళుడు భయంకరంగా గర్జించి, "కాలభైరవుడికోపంవస్తుంది! ఆఅసందర్భ ప్రలాపిని నా వద్దకు పంపండి," అన్నాడు.

భంజనుడు, ప్రవాళుణ్ణి కలుసుకున్నాడు. ఇద్దరి మధ్యా కొద్దిసేపు వాగ్వివాదం జరిగింది. భంజనుడు తెలివైనవాడనీ, అతడి మాటలు పూర్తిగా నిజమనీ తెలుసుకున్నాక, ప్రవాళుడతణ్ణి బుజ్జగిస్తూ, "మామూలు వైద్యంకంటే భూతవైద్యంలోనే ఆదాయమెక్కువ! అయితే, భూతవైద్యం వల్ల జబ్బు నయమైన వాళ్ళు తక్కువ. నా భూతవైద్యానికి నీ వైద్యం తోడైతే, మన జంటకు ఎదురుండదు. నేను

నీకు నా కూతుర్నిచ్చి పెళ్ళి చేస్తాను. మనం కలిసికట్టుగా వైద్యం చేద్దాం," అన్నాడు.

ఈ ఉపాయం భంజనుడికి నచ్చింది. అతడు ప్రవాళుడి గొప్పతనాన్నంగీకరించి, అతడికి శిష్యుడయ్యాడు. వారంరోజుల్లో చందనుడు మామూలుమనిషికావడంతో, ప్రజల్లో ఆ గురుశిష్యులపట్ల నమ్మకం పెరిగింది.

ఇలా మామాఅల్లుళ్ళయ్యాక ప్రవాళుడు, భంజనుడు ఎవరికి జబ్బు చేసినా వారది గాలిదోషమనేవారు. పూజకని డబ్బు దండిగా వసూలు చేసేవారు. ప్రసాదం పేరిట భంజనుడిచ్చే మందులు అద్భుతంగా పనిచేసి, రోగాలు చేత్తో తీసేసినట్టు మాయమయ్యేవి.అందువల్ల ప్రజల్లో రోజు రోజుకూ వారిమీద నమ్మకం విపరీతంగా పెరిగిపోయింది.

ఈవిధంగా, ఆరుమాసాల్లో రెండు లక్షలు కూడబెట్టాడు భంజనుడు. అయితే, అతడు ఎక్కడా తను ఉపాసకుడి శిష్యుడి నన్న విషయం బయటికి పొక్కనివ్వలేదు. ఉపాసకుడిపేరు బయటపెడితే, ప్రవాళుడి బండారమూ బయటపడుతుంది. ఉపాసకుడికంతపేరుంది మరి!

అంతేకాదు–భంజనుడు ఉపాసకుడికి గురుదక్షిణ ఇచ్చే ఉద్దేశ్యంలో కూడాలేడు. డబ్బు ఎగవేయాలన్న దురుద్దేశ్యంకంటే, తమ గురుశిష్యసంబంధం బయటపడకూడదనే అతడి భావం!

అయితే, భంజనుడి సంపాదన బాగానే వుంది కానీ, పవనగిరిలో అతడికి మంచి పేరులేదు. అతడొక మాంత్రికుడనీ, భూతప్రేతాలను ప్రేరేపించి సామాన్యులను ఇబ్బందికి గురిచేసి, ఆ తర్వాత వారి నుంచి డబ్బుబాగా గుంజి, ఆ ఇబ్బందులు



తొలగిస్తున్నాడనీ చాలామంది అనుకునే వారు. అయితే, అతడి గురించి వ్యతిరేకంగా మాట్లాడితే, ఏం ప్రమాదం ముంచుకొస్తుందో అని భయపడే వారు. కొంతలో కొంత ధనికులు ఫరవాలేదు కానీ, సామాన్యులు అతడి దోపిడీకి తట్టుకోలేక శాపనార్థాలు పెట్టుకునే వారు. ఎవరికీ గత్యంతరం లేకపోవడం వల్ల, భంజనుడి ఆదాయం మాత్రం పెరుగుతూనే వున్నది.

ఏడాది గడిచాక ఉపాసకుడు, శిష్యులిద్దరికీ తాను వస్తున్నట్టు కబురుచేశాడు. ఆయన ముందుగా పవనగిరి వెళ్ళి, భంజనుడి గురించి విచారిస్తే, అతడి భూతవైద్యం గురించీ, మితిమీరిన ధనాశ గురించీ తెలియవచ్చింది. ఇంటికి వెళితే – భంజనుడు ఇంట్లోవుండేలేనని చెప్పించాడు. అతడి మామ ప్రవాళుడు, ఉపాసకుడిగురించి తన అల్లుడు ఏనాడూ చెప్పలేదన్నాడు.

"నేను భంజనుడి గురువును. అతడి నుంచి నాకు, నేనాశించిన దానికంటే మంచి గురుదక్షిణ అందింది! ఎంతో సంతోషించానని చెప్పు," అనిఉపాసకుడు, అక్కణ్ణించి భువనగిరి వెళ్ళాడు.

రంజనుడాయనకు లక్షవరహాలు గురుదక్షిణ పేరిట ఇవ్వబోతే, ఉపాసకుడుతల అడ్డంగా ఊపి, "వైద్యవృత్తిలో, ఇంత తక్కువ వ్యవధిలో ఇంత డబ్బు సంపాదించడం– అసహాయులైన రోగులను దోపిడీ చేయడంవల్లనే వీలవుతుంది! ఈ డబ్బు నేను తీసుకోను. వైద్యుడికి సేవాధర్మముంది; అది నువ్వు గుర్తించలేదు. ఎప్ప



టికైనా నువ్వు గౌరవప్రదమైన గురుదక్షిణ ఇవ్వగల స్థాయికి ఎదుగుతావని ఆశిస్తున్నాను. నీకు మరొక విషయం చెబుతున్నాను. నా శిష్యులిద్దరి జీవిత మార్గాలూ చాలా నెలలక్రితమే తెలుసుకున్న నేను, ఆర్నెల్లకిందట రాజు ప్లవంగుడి జబ్బును నయం చేశాను. లక్షవరహాలు సంపాయించడానికి నీకు ఆ మార్గం మిగలలేదు," అని అక్కణ్ణించి గురుకులానికి తిరిగి వెళ్ళాడు.

బేతాళుడు ఈకథచెప్పి, "రాజా, లోకంలో అసూయా, మాత్సర్యాలకు బానిసలైన వారి ప్రవర్తన, ఒక్కొక్కసారి చిత్రాతిచిత్రంగా వుంటుంది. తన వద్ద మూడు సంవత్సరాల పాటు వైద్యవిద్యనేర్చి, దాన్ని భూతవైద్యానికి అంటుగా కట్టి, గురువుగా తన పేరైనా

పదిమందికీ చెప్పని భంజనుడి నుంచి, తను ఆశించిన దానికంటే మంచి గురు దక్షిణ అందింది, అన్నాడు ఉపాసకుడు. అదే ఉపాసకుడు, తన చిత్రపటానికి పూజచేస్తూ, పదిమందికీ తను ఉపాసకుడి శిష్యుణ్ణని చెప్పుకుంటున్న రంజనుడు ఇస్తానన్న లక్షవరహాలగురుదక్షిణను నిరాకరించడమేకాక, అతడు అసహాయులైన రోగులను దోపిడి చేస్తున్నాడన్న అపవాదు కూడా వేశాడు. భంజనుడి పట్ల సంతృప్తి, రంజనుడి పట్ల అసంతృప్తి కనబరచిన ఉపాసకుడి ప్రవర్తనను ఏమనాలి? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో, నీతలపగిలిపోతుంది,"అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఉపాసకుడికి ఏమాత్రం ధనాశ లేదు. అతడు తన శిష్యులలో సేవాధర్మాన్ని చూడాలనుకున్నాడు. కాని, రంజనుడు రాజు ప్లవంగుడి వింత వ్యాధికి మందుకనిపెట్టాలన్న సంగతే మరిచి, రోగులనుంచి సాధ్యమైనంతగా డబ్బు గుంజుతున్నాడు. అలాకాకుంటే, ఏడాదిలో లక్షవరహాలు గడించడం సాధ్యపడదు. వైద్యుడైనవాడు నయంకాని మొండి జబ్బులకూ, కొత్తవాటికీ మందులు కనిపెట్టి, ప్రతిభాశాలి అయిన వైద్యుడనిపించుకుని, సన్మానాలద్వారా, సత్కారాలద్వారా ధనం గడించాలి. అంతేగాని, వచ్చిన ప్రతిరోగినుంచీ, వీలుపడినంత పెద్దమొత్తం డబ్బు వసూలుచేసి కూడబెట్టడం, వైద్యవృత్తికే కళంకం. అందుకే, ఉపాసకుడు, రంజనుడితో – గౌరవప్రదమైన గురుదక్షిణ ఇవ్వగలస్థాయికి ఎదగగలవని ఆశిస్తున్నాను, అన్నాడు. ఇక భంజనుడి విషయానికివస్తే - అతడు దుష్టుడు. ఎంతో పవిత్రమైన వైద్యవృత్తిని,అతడు భూతవైద్యానికి కుదువపెట్టాడు. అలాంటివాడు తన శిష్యుణ్ణని చెప్పుకోకపోవడమే, మంచి గురుదక్షిణగా భావించి, ఆ సంగతే ఉపాసకుడు,భంజనుడి మామ అయిన ప్రవాళుడికి చెప్పాడు. ఇదంతా తరచి చూసినప్పుడు, ఉపాసకుడిలో రవ్వంతకూడా అసూయా, మాత్సర్యాలులేవని అర్థమవుతుంది," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం: "వసుంధర" రచన]



# కలకత్తానగరం

రచన: మీరా నాయర్ ▼ చిత్రకారుడు: గౌతమ్‌సేన్




పశ్చిమ బెంగాల్ రాష్ట్రరాజధాని కలకత్తా, మనదేశంలోని రెండవ అతిపెద్ద నగరం. ఈ శతాబ్దారంభం వరకు కలకత్తా బ్రిటిష్ ఇండియా రాజధానిగా ఉండేది.

ఇక్కడ బ్రిటిష్ వాళ్ళు మొట్టమొదట నిర్మించిన కోట ప్రాంతంలో ఈనాటి కలకత్తా జనరల్ పోస్టాఫీసు ఉన్నది. బెంగాల్ నవాబు సిరాజ్ - ఉద్ - దౌలా ఆ కోటను, 1756వసం॥లో నాశపరిచాడు. 'బ్లాక్‌హోల్' అనే సంఘటన అప్పుడే జరిగింది. ఆ సమయంలోనే 6×4 మీటర్ల కొలతలు గల చిన్న గదిలో 123మంది బ్రిటిష్ వాళ్ళను బంధించడం వల్ల వాళ్ళు ఊపిరాడకుండా అక్కడే చచ్చిపోయారని చెబుతారు. తపాలాకార్యాలయం ఈశాన్యదిశలో వున్న నల్లరాతి బండ ఆనాటి సంఘటనకు సాక్ష్యంగా ఉన్నది.

మొదటి కోటకన్నా చాలా పెద్ద కోటను బ్రిటిష్‌వాళ్ళు గోవిందపూర్‌లో నిర్మించి దానికి **'ఫోర్ట్ విలియం'** అని పేరుపెట్టారు. ఇది ఎప్పుడుగాని, ఎవరి ముట్టడికీ గురికాలేదు. మన దేశంలో ముట్టడికి లోనుకాని పెద్ద కోట అనే ప్రత్యేకతను విలియంకోట సంతరించుకున్నది.

కోట చుట్టూవున్న చిట్టడవిని తొలగించడంతో, 4 కి. మీ. పొడవూ, అర కి.మీ. వెడల్పూ గల పెద్ద **'మైదాన్'** ఏర్పడింది. ఇది ఈనాడు ప్రపంచంలోని అతిపెద్ద నగర ప్రాంత ఉద్యానవనాల్లో ఒకటిగా ప్రసిద్ధిగాంచింది.

క్రికెట్ క్రీడలు జరిగే **'ఈడెన్ గార్డెన్స్'** ఈ మైదాన్‌లోనే ఉన్నది. మనదేశంలోని మొట్టమొదటి క్రికెట్ క్లబ్ 1792వ సం॥లో ఇక్కడే ఏర్పాటు చేశారు.

రాయల్‌కలకత్తా గోల్ఫ్ క్లబ్; ప్రాంతీయ పోటీలలో ఎక్కువ సార్లు విజయం సాధించిన మోహన్ బాగన్ ఫుట్‌బాల్ క్లబ్; దేశంలోనే చాలా పెద్దదీ, పొడవైనదీ అయిన 'రేస్‌కోర్స్' గల 'రాయల్ కలకత్తా టర్ఫ్ క్లబ్' ఈ మైదాన్‌లోనే ఉన్నాయి.



ఈడెన్ గార్డెన్స్

# కలకత్తా


చౌరంఘీ స్ట్రీట్

చౌరంఘీ స్ట్రీట్‌ను ప్రస్తుతం జవహర్‌లాల్ నెహ్రూ రోడ్డు అని అంటున్నారు. ఇండియాలో మొట్ట మొదట అంటే 1859వ సం॥లోనే గ్యాస్ లైట్లు కాంతులు విరజిమ్మిన నగరం కలకత్తా. నలభైయేళ్ళ అనంతరం ఈ నగరమే ప్రథమంగా విద్యుదీకరణ చేయబడింది.

షహీద్ మీనార్

పదిహేను సంవత్సరాలపాటు సాగిన 'విక్టోరియా మెమోరియల్' నిర్మాణం 1921వ సం॥లో పూర్తయింది. 'రాజ్ తాజ్‌మహల్'గా ప్రసిద్ధిగాంచిన బ్రహ్మాండమైన ఈ భవనం 1901వ సం॥లో మరణించిన విక్టోరియా రాణి స్మృత్యర్థం నిర్మించబడింది.

ఈ భవన నిర్మాణానికి రాజస్థాన్ నుంచి తెప్పించిన ప్రత్యేకమైన తెల్ల చలువరాళ్ళను ఉపయోగించారు.


విక్టోరియా మెమోరియ

మనదేశంలోని మొట్టమొదటి భూగర్భ మెట్రో రైల్వే మార్గం కలకత్తాలో టోలీగంజ్ నుంచి డమ్‌డమ్ వరకు 16 కి.మీ. దూరం నిర్మించబడింది

భూగర్భ మెట్రోరైలు



కలకత్తా అధిదేవత కాళి. కాళీ ఘట్‌లోని కాళికాలయం సమీపంలోనే మదర్ థెరీసా స్థాపించిన 'నిర్మల్ హృదయ్' అనే అనాథ శరణాలయం – ఉన్నది. నీలిఅంచు తెల్ల నూలు చీరలు ధరించిన కన్యకాస్త్రీలు మిషనరీల నుంచి వెళ్ళి అనాథ శరణాలయాలలో, ఆస్పత్రులలో వున్న దిక్కులేని వారికీ, రోగులకూ సేవలు అందజేస్తారు.



# దృశ్యాలు

46మీ॥ ఎత్తయిన షహీద్‌మినార్‌ను మొదట 'ఆక్టర్‌లోనీ మాన్యుమెంట్' అని పిలిచే వారు. ఈస్టిండియా కంపెనీ సైనిక దళాలను నేపాళీల మీదికి నాయకత్వం వహించి నడిపించిన సర్ డేవిడ్ ఆక్టర్‌లోనీ జ్ఞాపకార్థం దీనిని 1828లో నిర్మించారు. ఈ మినార్ శిఖరం మీదికి 223 మెట్లు ఉన్నాయి.



నఖోడా మసీదు

సికింద్రాలోని అక్బర్ మసీదు నమూనాలో 1926వ సం॥లో 'నఖోడామాస్క్'ను నిర్మించారు. ఇదే, నగరంలోని పెద్ద మసీదు. ఒక్కసారిగా వదివేల మంది కూర్చోవడానికి వీలుకల్పించే విశాలమైన మసీదు ఇది.





మదర్‌థెరిసా

ఒకప్పుడు ఈస్ట్ – ఇండియా కంపెనీ గుమాస్తాలు పని చేసిన భవనం 'రైటర్స్ బిల్డింగ్'. 1880వ సం॥లో ఇది పూర్తిగా పునర్నిర్మించబడింది. ఇది ఈనాడు రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన సచివాలయంగా ఉంటున్నది.



రైటర్స్ బిల్డింగ్



రవీంద్రనాథటాగూర్ ఉత్తర కలకత్తా లోని **జొరశాంకో** గృహంలో జన్మించాడు. అభిమానులచే గురుదేవులుగా కీర్తించబడే విశ్వకవి రవీంద్ర నాథటాగూర్ రచించిన 'గీతాంజలి' అనే కవితా సంకలనానికి 1913వ సం॥ నోబెల్ సాహిత్య బహుమతి లభించింది.

తమ సాహితీ సంపదను గురించీ, సంప్రదాయాలను గురించీ కలకత్తా నగరవాసులు గొప్పగా చెప్పుకుంటారు.

**జొరశాంకో లేన్‌లోని టాగూర్ గృహం**

**అలిపూర్‌జాతీయగ్రంథాలయం**

మనదేశంలోని అతిపెద్ద గ్రంథాలయం. 51 కి.మీ. పొడవుగల స్టీలు బీరువాలలో 20 లక్షలు గ్రంథాలు, వ్రాతప్రతులు ఉన్నాయి. వ్యక్తిగతంగా చాలా పుస్తకాలు సేకరించినవాడు అశుతోష్ ముఖర్జీ. ఆయన పుస్తకాలన్నీ ఈ గ్రంథాలయంలో భాగమయ్యాయి.

కళ-ప్రయిుత్రసబెరగౌలనరీవన్న
నాన్ని నిర్మించాడు. ప్రపంచంలోని
తాలు మొదలైన కళాత్మకమైన
ంది.

ప్రదాయానుసారం ఇవాళ కూడా





కల్తకతాలోని మరొక సుప్రభవనర మార్బుల్ ప్యాలస్
వర్తకుడు రాజా రాజేంద్ర మల్లిక్ 1835వ సం॥లో ఈ చలువరాతి భవ
వివిధ ప్రాంతాలనుంచి సేకరించిన శిల్పాలు, విగ్రహాలు, చిత్ర
వస్తువులతో ఈ భవనంలోని ప్రతి గదీ అలంకరించబడి ఉన్న

ఇది రాజా వారసులకు చెందిన భవనం. వారి కుటుంబ సం
రోజూ మధ్యాహ్నం ఇక్కడ పేదసాదలకు అన్నదానం చేస్తారు.

**మార్బుల్ ప్యాలస్**





# తెలివైన ముసలాడు

గ్రీసుదేశంలో ఒక ముసలాడూ, వాడి భార్యా ఉండేవారు. ఒకనాడు ముసలాడు తన భార్యతో, "ఏమే; డబ్బు అవసరంగా కావాలి. నువ్వు సంతకుపోయి, మన ఆవును అమ్మిరా, నేనే పోదును గాని నా కాలు బెణికింది," అన్నాడు.

ముసలిది ఆవును తోలుకుని సంతకు బయలుదేరింది. ఆమె కొంత దూరం వెళ్ళేసరికి ముగ్గురు దొంగలు దూరం నుంచి, ముసలిది ఆవును అమ్మబోతున్న దని గ్రహించి, దాన్ని చవకగా కొనెయ్యటానికి ఒక ఉపాయం ఆలోచించారు.

ఒక దొంగ ముసలిదాన్ని కలుసుకుని, "మేకను అమ్మటానికి తీసుకుపోతున్నావా? ఎంతకుఅమ్ముతావేమిటి?" అనిఅడిగాడు.

"నీకు కళ్ళులేవుట్రా? ఆవు కనిపిస్తూంటే మేక అంటావేం?" అని ముసలిది వాణ్ణి కోప్పడింది.

దొంగవాడు విచారంగా తల ఆడించి, "బామ్మా, నువ్వేమన్నా కలగంటున్నావా ఏం? అది మేక. ముప్ఫై మాడలకు ఆ మేకను నాకు అమ్మెయ్యి," అన్నాడు.

ముసలిది వాణ్ణి తన చేతి కఱ్ఱతో ఒక పోటు పొడిచి, ముందుకు సాగింది.

ఆమె కొంతదూరం వెళ్ళేసరికి రెండో దొంగ తారసపడి, "అమ్మమ్మా, ఎక్కడి దాకా ప్రయాణం?" అన్నాడు.

"సంతకు, నాయనా. దీన్ని అమ్మమని ముసలాయనఅన్నాడు," అన్నది ముసలిది.

"పాతిక మాడలకు నేనే కొంటాను. నాకు అమ్మెయ్యి," అన్నాడు వాడు.

"నీకు మతిపోయిందిట్రా? నిక్షేపమంటి ఆవును మేక ఖరీదుకు అమ్మమంటావా?" అన్నది ముసలిది.

రెండో దొంగవాడు ఆశ్చర్యం నటిస్తూ, "పెద్దదానివయ్యావు. చత్వారం వచ్చేసింది.

**25–ఏళ్ళనాటి చందమామ కథ**



అందుకే మేకను చూసి ఆవు అనుకుంటున్నావు," అన్నాడు.

"అయితే అయిందిలే!" అంటూ ముసలిది ముందుకుసాగింది. కాని ఆమె మనసు ఆరాటపడుతున్నది. తాను ఆవును తీసుకుని బయలుదేరింది గదా, అందరూ దాన్నిచూసి మేక అని ఎందుకు అంటున్నారు?

ఇలా ఆలోచిస్తూ ఆమె మరి కొంత దూరం వెళ్ళేసరికి మూడో దొంగవాడు ఎదురుపడి, "అత్తా, మేకను అమ్మబోతున్నావా ఏం? ఇరవైమాడలకు నేనే కొంటాను," అన్నాడు.

"అయితే ఇది మేకే నన్నమాట! ఇదేదో గారడీలాగుంది. నేను బయలుదేరినది ఆవును తీసుకుని!" అన్నది ముసలిది.

"అత్తా, నీకు పైత్యవికారం లాగుంది. ఇరవై మాడలకు నాకు దీన్ని అమ్మి, ఇంటికి పోయి నడుం వాల్చు!" అన్నాడు మూడో దొంగవాడు జాలిగా.

"ఒకడు ముప్ఫై మాడలిస్తానంటే ఇంకోడు ఇరవైఅయిదు అన్నాడు. ఇద్దరికీ కాదని నీకు ఇరవైకి ఇయ్యమంటావురా? ముప్ఫై ఇచ్చి తీసుకో," అన్నది ముసలిది.

"న్యాయంగా ఈ మేక ముప్ఫైమాడలు చెయ్యదత్తా! పోనీ, పెద్ద ముండవు! శ్రమ పడిపోతావు. ముప్ఫై తీసుకో," అన్నాడు మూడో దొంగవాడు.

ముసలిది తన ఆవును మేక ఖరీదుకు అమ్మి, ఇంటికి తిరిగి వచ్చి, జరిగినదంతా తన మొగుడికి చెప్పింది. ముసలాడు ఆ దొంగవాళ్ళ వర్ణన వింటూనే, వాళ్ళు పొరుగూరి కుర్రాళ్ళని పోల్చుకుని, "జరిగినదేదో జరిగిందిలే, జరగవలిసింది నేను చూస్తాను," అన్నాడు.

ముసలాడు బయటికి వెళ్ళి, ఒకేరకంగా ఉన్న రెండు కుందేళ్ళను కొనుక్కొచ్చాడు. అందులో ఒక కుందేలును బుట్టలో పెట్టి మూతవేసి, రెండోదాన్ని మరో బుట్టలో పెట్టుకుని బయలుదేరుతూ తన భార్యతో, "ఏమే, ఇవాళ మనకు అతిథులు వస్తారు. తేనె రొట్టెలూ, పాయసమూ, బాతుమాంసం వేపుడూ చేసి సిద్ధంగా ఉంచు. నేను ఇంటికి వచ్చి, వంట ఏం చేశావని అడుగుతాను. కుందేలువచ్చి చెప్పినట్టే చేశానను," అని హెచ్చరించాడు.

ముసలివాడు పొరుగుగ్రామం వెళ్ళేసరికి ముగ్గురు దొంగవాళ్ళూ పానశాల

బయట జల్సా చేస్తున్నారు. వాళ్ళు ముసలాణ్ణి చూసి, "ఏం, ముసలాడా? నీ పెళ్ళానికి ఆవు ఏదో, మేక ఏదోకూడా తెలీదే!" అని వేళాకోళం ఆరంభించారు.

"ఆc, దాని మొహం! దానికి మతి సరిగా లేదు. అయితేనేం? వంట దివ్యంగా చేస్తుంది," అన్నాడు ముసలాడు.

"అదీ కొంత మేలే!" అన్నాడు ఒక దొంగవాడు.

ముసలాడు ఆలోచన నటిస్తూ, "ఇవాళ ఏం వంట చెయ్యమందాం? పాయసం తినాలనుంది. బాతు వేపుడు కూడా. పోతే, తేనె రొట్టెలు కూడా తింటాం!" అని, బుట్టలో నుంచి కుందేలును పైకి తీసి, "ఒసే, నువ్వు వెంటనే ఇంటికి పోయి, పాయసమూ, బాతు వేపుడూ, తేనె రొట్టెలూ చెయ్యమని అమ్మతో చెప్పు!" అంటూ వదిలేశాడు. అది చెంగు చెంగున ఎగురుతూ క్షణంలో ఎటో మాయమయింది.

"చిత్రంగా ఉందే! ఆ కుందేలు నిజంగా ఇంటికి పోయి నువ్వు చెప్పినదంతా ముసలిదానికి చెబుతుందా?" అన్నారు దొంగలు.

"ఎందుకు చెప్పదూ? చిన్నప్పటినుంచీ దాన్ని పెంచాను. నా మాట నమ్మకపోతే మా ఇంటికి వచ్చి మీరు కూడా భోజనం చెయ్యండి," అన్నాడు ముసలాడు.

ముగ్గురూ ముసలాడి వెంట వాడి ఇంటికి వచ్చారు. ముసలాడు, "ఏమే, వంట ఏం చేశావు?" అని భార్యను అడిగాడు.

"కుందేలు చెప్పినదే చేశాను," అన్నది ముసలిది. ఆమె నలుగురికీ వడ్డించింది. ముసలాడు కుందేలుకు చెప్పిన ప్రకారమే వంట సిద్ధం కావటం చూసి దొంగలు



మోసపోయి, తమలో తాము గుసగుస లాడుకుని, ఆ కుందేలును అమ్మ మన్నారు.

"కుందేలును అమ్మటమా? అది జరిగే పని కాదు!" అన్నాడు ముసలాడు. వాళ్ళు బేరం పదివేల మాడలకు పెంచినా ముసలాడు సరేననలేదు.

"వాళ్ళు అంతగా కావాలంటుంటే అమ్మరాదూ? డబ్బు కావాలని అంటూం టివిగా?" అన్నది ముసలిది.

"మన ఆవు మారినట్టు కుందేలు కూడా మారిపోతుందేమో?" అన్నాడు ముసలాడు తన భార్యతో.

దొంగలు ముగ్గురూ ఒకరికొకరు కన్ను మలిపి, "అలాటి భయం వద్దులే, ముస లాడా!" అన్నారు.

ముసలాడు పదివేల మాడలూ పుచ్చు కుని బుట్టతోబాటు తన రెండో కుందేలును వాళ్ళకు అమ్మేశాడు.

వాళ్ళు తమ గ్రామానికి తిరిగి వెళుతూ, "దీన్ని మన ఇళ్ళకు ముందుగా పంపి, మనకు ఏమేం వంటలు కావాలో మన పెళ్ళాలకు తెలియజేద్దాం," అనుకుని, ఒక్కొక్కడూ కుందేలుకు విడివిడిగా తమ అవసరాలుతెలిపి, కుందేలును వదిలేశారు. అది శరవేగంతో ఎటో వెళ్ళిపోయింది.

తరవాత ముగ్గురూ తమ తమ ఇళ్ళకు వెళ్ళి, కుందేలు రాలేదనీ, ముసలాడు తమను మోసం చేశాడనీ తెలుసుకున్నారు. వాళ్ళుముగ్గురూకలిసిముసలాడిఇంటికి వచ్చి, వాణ్ణి తిట్టనారంభించారు.

ముసలాడు ఓర్పుగా వాళ్ళ తిట్లన్నీ విని, "కుందేలును పంపేముందు దాన్ని ఒళ్ళంతా నిమిరారా?" అని అడిగాడు.

లేదని వాళ్ళు ఒప్పుకున్నారు.

"ఇంకేం? అది పిడికెడు గాలిగా మారి ఉంటుంది," అన్నాడు ముసలాడు.

"కుందేలు గాలిలో కలిసిపోవటమే మిటి? పిచ్చిగా మాట్లాడకు!" అన్నారు దొంగలు ముగ్గురూ.

"ఇంతపెద్ద ఆవు చిన్న మేకగా మారగా లేనిదీ, కుందేలు గాలిలో కలవటం విడ్డూరమా?" అని ముసలాడు అడిగాడు.

ముసలాడు తమ మీద పగతీర్చు కున్నాడని గ్రహించి దొంగలు వెళ్ళిపో యారు.



ఆంగ్లేయులనుఎదిరించిన యోధులు

(3)

# వీరపాండ్య కట్టబొమ్మన్

రచన: మీరా ఉగ్రా

చిత్రాలు: గౌతమ్‌సేన్

18వ శతాబ్దంలో పాలెగార్లుతమిళనాడులోచిన్నచిన్నసంస్థానాధిపతులుగా ఉండేవారు. అర్కాటు నవాబుకు వాళ్ళు పన్నులువసూలు చేసి పెట్టేవారు. కోటల నుంచి తమపాలన సాగిస్తూ ప్రత్యేకసైన్యాలు కూడా ఏర్పాటుచేసుకున్నారు. 1792వ సం॥లో అర్కాటు నవాబు ఈస్టిఇండియా కంపెనీకి పన్నులు వసూలు చేసేహక్కును ధారాదత్తం చేసినప్పుడుఈప్రాంతంలో అటువంటి సంస్థానాలు 72 ఉండేవి.

పాంచాలన్ కురిచ్చిపాలెగారైన వీరపాండ్య కట్టబొమ్మన్ ఈ నూతన ఒప్పందాన్ని తీవ్రంగా ప్రతిఘటించాడు.




కేప్టన్ మాక్స్‌వెల్ ఆయన్ను చూడడానికి వచ్చినప్పుడు –









తిరునెల్వేలికి జాక్సన్ కలెక్టర్‌గా వచ్చాడు. ఆయన్ను చూడమని కట్టబొమ్మన్‌కు కబురు వచ్చింది. అయితే-




ఆఖరికి ఆయన జాక్సన్‌ను రామనాథపురంలో కలుసుకున్నాడు.







కట్టబొమ్మన్ ఆగ్రహంతో అక్కడినుంచి బయలు దేరాడు.












కోట లోపల –

వాళ్ళు కోటను ముట్టడించారు. కాని మేము ఎదురొడ్డి తిప్పికొట్టాం.

వాళ్ళు మళ్ళీ రావచ్చు! అప్రమత్తులై ఉండాలి!



బ్రిటిష్ సేనలు వచ్చి మళ్ళీ కోటను ముట్టడించాయి. యుద్ధం జరిగింది. బ్రిటిష్ సేనలుకోటలోపలికి జొరబడ్డాయి. –

వీరపాండి ఎక్కడ?

మేము పులి గుహను పట్టుకున్నాం. కాని పులి



... సాటి పాలెగార్లు ఎవరూ ఆయనకు సాయపడలేదు. పరాయి పాలకులకు దాసులయ్యారు.




కట్టబొమ్మన్ అడవిలో దాక్కుని ఉన్నప్పుడు పుదుక్కోట రాజా ఆయన్ను చుట్టుముట్టాడు.




ఈస్ట్ఇండియా కంపెనీ బహిరంగ విచారణ జరిపింది. పర దేశస్థుల అధికారానికి ఏమాత్రం తలవొగ్గని వీరపాండ్య కట్టబొమ్మన్‌కు బ్యానర్‌మన్ మరణదండన విధించాడు. పాలెగాళ్ళ ఎదుట ఉరితీయాలని నిర్ణయించాడు. కట్టబొమ్మన్ చివరి క్షణాల గురించి బ్యానర్‌మన్ ఇలా రాశాడు: కుడి ఎడమల నిలబడిన్న పాలెగార్లకేసి ధిక్కారంతో, హేళనగా చూస్తూ, అచంచలమైన ధైర్యంతో అతడు ముందుకునడిచాడు.





కట్టబొమ్మన్ ధైర్యంగా చింత చెట్టుకేసి నడిచి, స్వయంగా ఉరితాటిని మెడచుట్టూ తగిలించుకున్నాడు!




అర్జునుడు కొంతదూరంముందుకు వెళ్ళి కౌరవసేనల మీద బాణవర్షం కురిపించి, గట్టిగా శంఖం పూరించాడు. ఆ ధ్వని విని గోవులు మోరలెత్తి వెనక్కు తిరిగి పరిగెత్త సాగాయి.అర్జునుడు వచ్చిన పని అప్పుడే తీరినట్టు కనపడింది. కాని అతను దుర్యోధనుడి మీదికి పోతూ ఉండగా, కౌరవ వీరులు అందరూ అతనికి ఎదురు వచ్చారు. అర్జునుడు వారిలో కర్ణుణ్ణి చూసి, ఉత్తరుడితో రథాన్ని కర్ణుడికేసి నడపమన్నాడు. కర్ణుణ్ణి అనుసరించి ఉన్న యోధులు కొందరు అర్జునుడిపై యుద్ధం ప్రారంభించారు. అర్జునుడు వారినందరినీ ఓడించి, కొందరిని చంపాడు. యుద్ధం తీవ్రమయింది. అర్జునుడిచేత చచ్చిన వారిలో కర్ణుడి తమ్ముడు కూడా ఉన్నాడు. అది చూసి కర్ణుడు అమిత పౌరుషంతో అర్జునుణ్ణి ఎదుర్కొన్నాడు. అర్జునుడు కోరినదీ అదే. ఇద్దరూ ద్వంద్వయుద్ధం చేస్తూంటే మిగిలిన వాళ్ళు చూస్తూ ఉండిపోయారు. కొంతసేపు యుద్ధంచేసి, తీవ్రంగా గాయపడి కర్ణుడు వెనక్కుపోయాడు.

కౌరవులు అర్జునుడి యుద్ధ నైపుణ్యాన్నే గాక, ఉత్తరుడి సారథ్య నైపుణ్యాన్నికూడా మెచ్చుకున్నారు.

కర్ణుడు వెనక్కు తగ్గగానే మళ్ళీ కౌరవ యోధులందరూ అర్జునుడిపై యుద్ధం సాగించారు. వారిలో కృపాచార్యుణ్ణి ఎంచుకుని అర్జునుడు తన రథాన్ని ఉత్తరుడిచేత అటు నడిపించాడు. అర్జునుడిరథం కృపాచార్యుడి రథానికి ప్రదక్షిణం చేసి ఎదురుగా నిలబడింది. ఇద్దరికీ ఘోరంగా జరిగినయుద్ధంలో కృపాచార్యుడు ఓడాడు. కృపాచార్యుడు వెనక్కుతగ్గగానే ద్రోణుడు అర్జునుడితో యుద్ధం చేయటానికి ముం

**42. కౌరవ పరాజయం**



దుకు వచ్చాడు. అప్పుడు అర్జునుడు ద్రోణుడికి నమస్కారంచేసి, "గురూ, వనవాసంలో మేముచాలాకాలం కష్టాలు అనుభవించాం. మా మీద కోపంవద్దు. ముందు మీరు నా మీద బాణం వేస్తేనేగాని నేను మీతో యుద్ధం చెయ్యలేను," అన్నాడు.

ద్రోణుడు ముందుగా తానే అర్జునుడిపై బాణాలు వేశాడు. తరవాత ఇద్దరూయుద్ధం చేశారు. నిజానికి కౌరవసేనలో ద్రోణుడికి చాలిన యోధుడులేడు. అర్జునుడు ఆయనను బాణ వర్షంలో ముంచి ఎత్తేసరికి, కౌరవసేనలలో హాహాకారాలు చెలరేగాయి.

అది చూసి ద్రోణుడి కొడుకైన అశ్వత్థామ అర్జునుణ్ణి తనబాణాలతోతాకాడు. అప్పుడు అర్జునుడు ద్రోణుణ్ణి తొలగిపోనిచ్చి, తన రథాన్ని అశ్వత్థామకేసి నడిపించాడు. అశ్వత్థామ అర్జునుణ్ణి చాలాసేపు చిక్కు పెట్టాడు, కాని చివరకు అర్జునుడిదే పైచెయ్యి అయింది.

ఈ విధంగా అర్జునుడు విజృంభించి మరొకసారి కర్ణుడితోనూ, దుశ్శాసనుడితోనూ కౌరవవీరులందరితోనూ యుద్ధం చేశాడు. ఆ యోధులు పారిపోసాగారు. భీష్ముడుఅర్జునుడితో యుద్ధానికి వచ్చాడు.

ఇద్దరూ ఒకరి మీదొకరుఅస్త్రాలు ప్రయోగించుకున్నారు.తరవాత మామూలు బాణాలతో యుద్ధం చేశారు. చివరకు భీష్ముడు రథంలో తెలివితప్పిపడిపోయాడు. ఆయన సారథి రథాన్నిదూరంగా తోలుకుపోయాడు.

అది చూసి దుర్యోధనుడే అర్జునుడిపైకి వచ్చాడు. ఇద్దరూ తీవ్రంగానేయుద్ధం చేశారు. అర్జునుడు ఒక బాణంతో దుర్యోధనుడి రొమ్ములో కొట్టాడు. ఆ దెబ్బతో దుర్యోధనుడు రథంతో పారిపోయాడు. పారిపోతున్న దుర్యోధనుణ్ణి చూసి అర్జునుడు గేలిచేశాడు.

దుర్యోధనుడు రోషంవచ్చి, తిరిగి అర్జునుడి కేసి వచ్చాడు. అతని వెంట మిగిలిన కౌరవ యోధులందరూ వచ్చారు. అర్జునుడు ఆ అందరితోనూ యుద్ధంచేస్తూ సంమోహనాస్త్రం ప్రయోగించాడు. దాని ఫలితంగా యోధులందరూ ఆయుధాలు జారవిడిచి మూర్ఛపోయారు.

అప్పుడు అర్జునుడు ఉత్తరుడితో, "నాయనా, పగ్గాలు పక్కన పెట్టి వెళ్ళి, త్వరగా ఆ యోధుల తలగుడ్డలు తీసుకురా. ఉత్తర రంగురంగుల బొమ్మ పొత్తికలు తెమ్మన్నది. ఆ తలగుడ్డలలో

కృపుడిది తెల్లనిది, కర్ణుడిది పసుపు పచ్చది, దుర్యోధనుడిదీ, అశ్వత్థామదీ నీలంరంగువి. నేను వేసిన అస్త్రం భీష్మణ్ణి బాధించదు. అందుచేత ఆయన జోలికి మాత్రం పోకు," అని చెప్పాడు.

ఉత్తరుడువెళ్ళి, తలపాగాలు తీసుకుని వెంటనే తిరిగివచ్చిరథం ఎక్కాడు. అతడు రథాన్ని సేనల మధ్యగా నడుపుతుంటే భీష్ముడు అర్జునుణ్ణి తనబాణాలతో అటకాయించాడు. అర్జునుడు భీష్ముడి రథం గుర్రాలను చంపి, భీష్ముడితో యుద్ధానికి దిగకుండా ముందుకు సాగాడు.

అంతలో దుర్యోధనుడికి స్పృహవచ్చింది. నిశ్చింతగాపోతున్న అర్జునుణ్ణి చూసి అతడు, "ఇతన్ని ఎందుకిలా నిశ్చింతగా పోనిస్తున్నారు? ఇతను తప్పించుకుపోకుండా చూడండి," అని కేక పెట్టాడు.

ఆ మాట విని భీష్ముడు, "నీ తెలివి ఏమయింది? అందరూ అస్త్రాలు జారవిడిచి స్పృహ తప్పి ఉంటే ఈ అర్జునుడు అందరినీ చంపగలిగి ఉండి కూడా తల గుడ్డలు మాత్రం తీసుకున్నాడు. అతను గెలిచినట్టు ఒప్పుకో. ఆవుల మందలను తీసుకుపోనీ," అన్నాడు.

భీష్ముడు చెప్పిన ప్రకారం కౌరవులు ఓటమి ఒప్పుకుని తిరిగి వెళ్ళి పోవటానికి నిశ్చయించారు. వాళ్ళు వెళ్ళి పోవటం చూసి అర్జునుడు సంతోషించి భీష్ముడికీ, ద్రోణుడికీ, కృపుడికీ, అశ్వత్థామకూ మిగిలిన కురువీరులకూ నమస్కార బాణాలు వేసి; ఒక బాణంతో దుర్యోధనుడి కిరీటాన్ని మటుకు పగలగొట్టాడు.



అతను ఉత్తరుడితో, "శత్రువులను ఓడించాం. గోగణాలను కాపాడాం! ఇక ఆనందంగా ఇంటికి పోదాం పద," అన్నాడు.

రథం శమీవృక్షం దగ్గిర మరొకసారి నిలిచింది. పాండవుల అస్త్రాలన్నీ తిరిగి ఆ చెట్టుమీదికి చేరాయి. అర్జునుడు సారథి స్థానంలో కూర్చుని, "పాండవులందరూ తనకొలువులో ఇంతకాలమూ దాగి ఉన్నట్టు తెలిస్తే మీ తండ్రి భయంతో కంగారు పడిపోతాడు. అందుచేత యుద్ధం చేసి కౌరవులను జయించినది నువ్వేనని ఆయనతో చెప్పు," అని ఉత్తరుడితో అన్నాడు.

"మహానుభావా, నువ్వు చేసిన ఈ యుద్ధం నాబోటి వాడివల్ల ఏమవుతుంది?



ఉత్తరుడు బయలుదేరాడనీ, ఉత్తరుడికి బృహన్నల సహాయంగా వెళ్ళాడనీ అంతః పుర స్త్రీలు విరాటుడికి చెప్పారు.

ఈ వార్త విని విరాటుడు కంగారుపడి తన మంత్రులతో, "సుశర్మతో యుద్ధం చేసిన మిగిలిన యోధులనందరిని ఉత్తరుడికి సాయంపంపండి. నపుంసకుణ్ణి సారథిగా పెట్టుకున్న ఉత్తరుడు ప్రాణాలతో ఉన్నాడో, లేడో ముందు తెలుసుకోండి," అంటూ ఆవేశపడ్డాడు.

విరాటుడి భయం చూసి ధర్మరాజు చిన్నగా నవ్వి, "బృహన్నల సారథిగా ఉండగా నీకుమారుడు గెలిచితీరుతాడు. కౌరవసేనలేకాదు, దేవాసుర సేనలు ఎదురైనా అతనికి అపజయం ఉండదు," అన్నాడు.

అంతలోనే, ఉత్తరుడు శత్రువులను జయించి, గోవులను విడిపించి తిరిగి వస్తున్నట్టు విరాటుడికి వార్త తెలిసింది. అది విని ధర్మరాజు, "ఉత్తరుడు విజయుడై తిరిగి రావటం శుభం. అయితే, బృహన్నల సారథిగా ఉండగా ఉత్తరుడు జయించటం నాకేమీ ఆశ్చర్యం కలిగించదు," అన్నాడు.

కొడుకు గెలిచాడని వింటూనే విరాటుడు పరమానందభరితుడై, వార్త తెచ్చిన వారికి బంగారు బట్టలు కప్పి, రాజమార్గాలను అలంకరించమనీ, ఉత్తరుడి విజయం చాటించమనీ, మంగళ వాద్యాలతో ఉత్తరుడికి ఎదురు వెళ్ళమనీ ఆజ్ఞాపించాడు. తరవాత ఆయన సైరంధ్రితో, "పాచికలు పట్టుకురా. కంకుడితో జూదం ఆడాలి," అన్నాడు.

అయినా నీ ఆజ్ఞ అయ్యేవరకూ నిజం దాచిపెట్టి, నేనే యుద్ధం చేసి గెలిచినట్టు చెబుతాను," అన్నాడు ఉత్తరుడు.

"మనం విశ్రాంతి తీసుకుని, గుర్రాలకు నీరు పెట్టి, మధ్యాన్నం దాటాక నగరం చేరుదాం. ఈలోపుగా మీ గోపాలకులను వెళ్ళి, నువ్వు గెలిచినట్టు మీ తండ్రిగారికి వార్త చెప్పమను," అన్నాడు అర్జునుడు.

ఈలోపుగావిరాటుడు సుశర్మనుఓడించి నగరానికి తిరిగివచ్చి, కొలువుతీరి కూర్చున్నాడు. పెద్దలైన పౌరులూ, బ్రాహ్మణులూ ఆయన విజయాన్ని అభినందించారు.

ఆయన, "ఉత్తరుడు ఎక్కడికి వెళ్ళాడు?" అని అడిగాడు.

కౌరవసేనలు వచ్చి గోవుల మందలను పట్టుకున్నాయనీ, వాటిని విడిపించటానికి

ఇద్దరూ జూదం ఆడటానికి కూర్చు న్నారు. అప్పుడు విరాటుడుధర్మరాజుతో, "చూశావా, కంకుభట్టూ, నా కొడుకు ఎందరో మహావీరులను ఒంటరిగా ఎది రించి, జయించాడు!" అన్నాడు.

దానికి ధర్మరాజు, "బృహన్నల సారథిగా ఉండగా ఎందుకు జయించడూ," అన్నాడు.

విరాటుడికి చప్పున కోపం వచ్చింది. ఆయన ధర్మరాజుతో, "బ్రాహ్మణాధమా, నా కొడుకుతో సమంగా ఆ నపుంసకుణ్ణి మెచ్చుకుంటావా? నీకు అనదగినదీ, అనరానిదీ కూడా తెలియదే. ఈసారికి క్షమించాను మరొకసారి ఇలా మాట్లాడితే నీ ప్రాణానికేప్రమాదం. జాగ్రత్త!" అన్నాడు.

దానికి ధర్మరాజు, "భీష్ముడూ, ద్రోణుడూ, అశ్వత్థామా, కర్ణుడూ, కృపుడూ గల కౌరవసేనను ఇంద్రుడుకూడా జయిం చలేడు. అలాటి శక్తి బృహన్నలకే ఉన్నది. బృహన్నల సహాయంఉండగా నీకొడుకు అంతమంది వీరులను గెలవటంలో వింత ఏమీ లేదు," అన్నాడు.

విరాటుడు మండిపడి, "మళ్ళీ అదే మాట అంటావా?" అంటూ పాచికలను ధర్మరాజుముఖంమీదికి విసిరాడు. ధర్మ రాజు ముక్కుకు దెబ్బ తగిలి నెత్తురు కారసాగింది. ఆ రక్తం కిందపడేలోపుగా ద్రౌపది పక్కనే ఉండి తన చేతిలోకి పట్టుకున్నది. తరవాత ఆమె ధర్మరాజు అభిప్రాయం గ్రహించి, ఒక బంగారు పాత్ర తెచ్చి, ధర్మరాజు ముక్కునుండికారే రక్తాన్ని అందులో పట్టింది.



ఇంతలో ఉత్తరుడూ, బృహన్నలా వచ్చినట్టు ద్వారపాలకుడు విరాటుడితో చెప్పాడు.

"వారిద్దరినీ చూడాలని నేను తొందర పడుతున్నాను. వెంటనే వారిని లోపలికి ప్రవేశపెట్టు," అని ద్వారపాలకుడితో విరా టుడు అన్నాడు.

ధర్మరాజుద్వారపాలకుడితోరహస్యంగా, "బృహన్నలను ప్రవేశపెట్టకు. ఉత్తరుణ్ణి మాత్రమే ప్రవేశపెట్టు. యుద్ధంలో తప్ప, నన్నెవరన్నా గాయపరిస్తే వాళ్ళను చంపుతా నని బృహన్నలకు వ్రతం ఉన్నది. నా రక్తం చూస్తే అతను మీ రాజును సకుటుం బంగా నాశనం చేస్తాడు," అని చెప్పాడు.

తరవాత ఉత్తరుడు ఒక్కడే విరాటు డున్నచోటికి వచ్చి, తండ్రి కాళ్ళకు నమ

స్కారం చేసి,తరవాత ధర్మరాజు కాళ్ళకు నమస్కారంచేసి లేచి, ధర్మరాజు ముక్కు నుంచి కారుతున్నరక్తంచూసి చాలా ఆవేద నపడుతూ, "ఈ మహానుభావుణ్ణి ఎవరు ఇలా చేశారు? ఈపాడుపని ఎవరిది?" అని అడిగాడు.

"ఈ మతిమాలినవాడు నిన్ను కాదని ఆ నపుంసకుణ్ణి మెచ్చుకుంటుంటే కోపం వచ్చి నేనే ఒక దెబ్బతీశాను," అన్నాడు విరాటుడు.

"ఎంత పొరపాటు చేశావు! బ్రాహ్మణ కోపం కార్చిచ్చులాగ దహిస్తుంది. అందు చేత ఆయనను మంచిచేసుకో," అని ఉత్తరుడు తండ్రికి హితవు చెప్పాడు.

విరాటుడు క్షమాపణ చెప్పుకోగా ధర్మ రాజు, "రాజా,నా కోపంపోయి చాలా సేప యింది. అంతకన్నా నారక్తం నేలమీద పడటం నీ దేశానికీ, నీకూ ఎక్కువహాని!" అన్నాడు.

ధర్మరాజు ముక్కు నుంచి కారే రక్తం నిలిచిపోయింది. కొద్దిసేపట్లో ఉత్తరుడు బృహన్నలతోసహా అక్కడికివచ్చాడు. బృహ న్నల విరాటరాజుకూ, కంకుడికీ నమస్కా రాలుపెట్టి నిలబడ్డాడు. అప్పుడు విరాటుడు ఉత్తరుణ్ణి చూసి బృహన్నలకు వినిపించే లాగా, "నాయనా, నువ్వు నాకు నిజంగా తగిన కొడుకువు అనిపించావు. నీలాటి శూరులు ఎక్కడాఉండరు. కర్ణుడుఅంతటి పరాక్రమశాలి గదా, అతనితో ఎలా యుద్ధం చేశావు? భీష్ముడంతటి మహాయోధుణ్ణి ఎలా జయించగలిగావు? ద్రోణుడూ, ఆయన కొడుకుఅశ్వత్థామా ఎంతటి వీరులు! కృపాచార్యుణ్ణి చూస్తేనే సామాన్య యోధులు వణికిపోతారు గదా! దుర్యోధ నుడు ఉండనేఉన్నాడు. ఇలాంటి మహా వీరులందరినీజయించి, మన గోవులను విడిపించుకువచ్చావంటేమలయమారుతం వీచినట్టు అనిపించింది," అన్నాడు.

ఈ ప్రశంసలు విని ఉత్తరుడు, "గోవు లను నేను విడిపించలేదు. శత్రువులను జయించినది కూడా నేనుకాదు. ఎవరో దేవుడు అదంతా చేశాడు. శత్రువులను చూసి బెదిరి పారిపోతున్న నన్ను ఆపి, అతను రథంమీదకూర్చుని, నన్ను సారథిగా పెట్టుకుని, యుద్ధంచేసి గెలిచాడు," అన్నాడు.



# చందమామ కబుర్లు

## షాక్ అంటే తెలియని మనిషి!

పిల్లలను విద్యుత్తు దగ్గరికిగాని, విద్యుత్తు పరికరాల దగ్గరికి గాని వెళ్ళకుండా జాగ్రత్త పడతాం. ఎందుకంటే షాక్ కొడుతుందని భయం. అలా పంపడం ప్రాణాలతో చెలగాటమే



అవుతుంది. అయితే, కేరళ రాష్ట్రం క్విలాన్‌కు చెందిన రాజ్‌మోహన్ మాత్రం 'ఎలక్ట్రిక్‌షాక్' అంటే ఆటగా తీసుకుంటున్నాడు. అతడు ఎలక్ట్రిక్ వైరును తాకినా షాక్ తినడంలేదు. అతడు పదమూడేళ్ళ కుర్రాడుగా వున్నప్పుడు జీవితం మీద విరక్తి కలిగి, చచ్చిపోదామని ఎలక్ట్రిక్ పోల్‌ను ఎక్కి 'లైవ్‌వైర్'ను తాకాడు. ఆశ్చర్యం! అతనికి ఏమీ కాలేదు. తన శరీరాన్ని విద్యుత్ ప్రసరణ ఏమీ చేయడంలేదని అతడు గ్రహించాడు. ఆ తరవాత అతడు దానినే తన జీవనోపాధికి మార్గంగా మలుచుకున్నాడు. ఇప్పుడతడు తన 'సామర్థ్యం' ప్రదర్శించి దాని ద్వారా తన పొట్ట నింపుకుంటున్నాడు. అతడు శరీరానికి ఇన్సులేషన్ లేని వైర్లను చుట్టుకుని, దానిలో 38,000 వోల్టుల విద్యుత్తును ప్రసరింపజేస్తున్నాడు. టెస్టర్‌తో పరిశోధిస్తే నిప్పురవ్వలు ఎగిరి పడతాయి తప్ప, అతని శరీరానికి ఏమీకావడం లేదు. 1986వ సం॥లో ఢిల్లీలోని 'ప్రపంచ విజ్ఞాన సాంకేతిక సంస్థ' అతన్ని పరిశోధించింది. ఆ సంస్థ సభ్యులు రాజ్‌మోహన్ శరీర తత్వాన్ని వివరించలేకపోయారు. 'కరెంట్ మోహన్'గా ప్రసిద్ధిగాంచిన ఆ యువకుడి పేరు 1992వ సం॥లో గిన్నిస్‌బుక్ ఆఫ్ రికార్డ్స్‌లో చోటుచేసుకుంది.

## 'బంగారు గుండె!'

పంజాబుకు చెందిన నరేంద్రకుమార్‌కు అక్షరాలా బంగారు గుండె వుంది. ఆయన ఢిల్లీలోని ఒక ఆస్పత్రిలో గుండె శస్త్రచికిత్స చేసుకున్నాడు. ఆయనకు గుండె ధమనుల్లో ఏర్పడిన అడ్డును తొలగించారు. గుండెకు రక్తం సరఫరా కావడానికి వీలుగా 24 క్యారెట్ బంగారు 'వైర్‌మెష్‌ను' గుండెలో అమర్చారు. దీని బరువు 1గ్రాముకన్నా తక్కువే వుంటుంది. మామూలుగా ఇలాంటి వాటికి 'స్టెయిన్ లెస్ స్టీల్' వైర్‌మెష్‌ను ఉపయోగిస్తారు. గుండెలో శాశ్వతంగా ఉండడానికి బంగారువైర్‌మెష్‌ను అమర్చారు. ఇది స్టెయిన్ లెస్ స్టీల్ వైర్‌మెష్ కన్నా ఉత్తమమైనదనీ దీనివల్ల ఎటువంటి దుష్పరిణామాలూ ఉండవనీ డాక్టర్లు అభిప్రాయ పడుతున్నారు.



మనదేశపు
అందచందాలు

# భరత్‌పూర్ పక్షుల శరణాలయం

ఢిల్లీకి 180కి.మీ.-దూరంలో వున్న చారిత్రాత్మక పట్టణం భరత్‌పూర్. ఇక్కడ 18వ శతాబ్దానికి చెందిన ఒక కోట కూడా ఉన్నది. ఈ పట్టణ సమీపంలో 29 చ.కి.మీ. విస్తరించిన చిత్తడినేలలో 'కేలదేవ్ నేషనల్‌పార్క్' అనేపక్షుల శరణాలయం ఉన్నది. దీనిని చూడడానికి రోజూ పర్యాటకులు వస్తూవుంటారు.





ఇక్కడ వున్న ఒక దేవాలయం కారణంగా దీనికీ పేరు వచ్చింది. ఈ చిత్తడి నేలలో దట్టమైన పొదలు,తటాకాలు, కాలువలు; అడవిలా విస్తరించిన చెట్ల మధ్య పుచ్చిన దుంగలు ఉండడం వల్ల, ఇవి పక్షులు గుడ్లు పెట్టడానికి అనువైన పరిసరాలను సృష్టించి రకరకాల పక్షులను ఆకర్షిస్తున్నాయి. ఇక్కడ దాదాపు 328 జాతుల పక్షులు ఉన్నాయి. ఉత్తర సైబీరియా, చైనా వంటి దూరతీరాల నుంచి కూడా ఇక్కడికి పక్షులు వస్తాయి. దూరప్రాంతాల నుంచి వచ్చే వాటిలో సైబీరియాకొంగలు చాలా ఆకర్షణీయమైనవి.

మిగతా అడవులలాగే ఇది మొదట భరత్‌పూర్ మహారాజా వారి వేటప్రాంతంగా ఉండేది. అయితే, 1964వ సం॥లో ఇక్కడ వేటాడడం నిషేధించి, దానిని సంరక్షిత ప్రాంతంగా ప్రభుత్వం ప్రకటించింది. పక్షుల అభిమానులకు అంతర్జాతీయస్థాయిలో 'పక్షుల స్వర్గం'గా భరత్‌పూర్ ప్రసిద్ధిగాంచింది. శరణాలయం లోపల తటాకాలలో కాలువలలో వెళ్ళి పక్షులను మరింత దగ్గరగా పరిశీలించడానికి వీలుగా చిన్న చిన్న పడవలు ఉన్నాయి. లోపల కొన్ని ప్రదేశాలకు సైకిళ్ళను, సైకిల్ రిక్షాలను కూడా అనుమతిస్తారు. పక్షులే కాకుండా జింకలు, అడవిపందులు, నెమళ్ళు వంటివి కూడా ఇక్కడ ఉన్నాయి. ఒక్కొక్కసారి కొండచిలువలు వంటి పెద్దపెద్ద పాములుకూడా కనిపిస్తాయి.

పురాణకాలంనాటి రాజులు:

# ధర్మగుప్తుడు

చంద్రవంశానికి చెందిన ధర్మగుప్తుడనే రాజు వేటకు వెళ్ళాడు. సాయంకాలం వరకు వేటాడుతూ, తన వెంటవున్న అంగరక్షకులకు దూరమయ్యాడు. చీకటిపడడంతో ఎటువెళ్ళడానికీ మార్గంలేక, క్రూర మృగాల బారిపడకుండా ఒక చెట్టుపైకి ఎక్కాడు.

ఆయన ఆ చెట్టుపైకి చేరడానికి ముందే అక్కడొక ఎలుగుబంటి ఉన్నది. అది ధర్మగుప్తుణ్ణి చూడగానే, "రాజా! మనం ఈ రాత్రికి సింహం వాతపడకుండా తప్పించుకోవాలి. నువ్వు బాగా అలిసి పోయి నట్టున్నావు. నువ్వు అర్ధరాత్రి వరకు నిద్రపో. నేను అంతవరకు మేలుకుని కాపలా వుంటాను. నువ్వు మేలుకున్న తరవాత నేను నిద్రపోతాను. అప్పుడు నువ్వు నాకు రక్షణగా ఉండాలి! సరేనా?" అన్నది.

రాజు అందుకు అంగీకరించి, కొమ్మలకు ఆనుకుని నిద్రకు ఉపక్రమించాడు.

కాసేపటికి అక్కడికి ఒకసింహంవచ్చి, చెట్టుపైకిచూస్తూ, ఎలుగుబంటితో, "మిత్రమా! నువ్వా మనిషిని కిందికితోశావో, వాడితో నా ఆకలి తీరిపోతుంది. నీ జోలికి రాను," అన్నది. ఎలుగుబంటి అందుకుఒప్పుకో లేదు. సింహం వెళ్ళిపోయింది.

అర్ధరాత్రి గడిచాక రాజు మేల్కొన్నాడు. ఎలుగుబంటి నిద్రకు ఉపక్రమించింది.

కొంతసేపటికి మళ్ళీ అక్కడికివచ్చినసింహం, "ఓ, మానవుడా! ఆ ఎలుగుబంటిని కిందికి తోసెయ్! నేను నీకు హానిచేయను!" అన్నది.

ఆ క్షణమే రాజు ఎలుగుబంటిని పట్టి కిందికితోశాడు. ఉలిక్కిపడిలేచిన ఎలుగుబంటి, కింది కొమ్మను ఒడిసి పట్టుకుని కింద పడిపోకుండా జాగ్రత్తపడింది. బాధతో యువరాజును, "ఇంతటినమ్మకద్రోహమా? కృతఘ్నుడా! పిచ్చివాడివైపోదువుగాక!" అని శపించింది.

ధర్మగుప్తుడు మతిచలించి చాలాకాలం అనేక కష్టాలు అనుభవించాడు. తన తప్పుకు పశ్చాత్తా పంచెంది, ఆఖరికి జైమినిముని కరుణతో, పవిత్ర తీర్థస్నానంచేసి మామూలు మనిషి అయ్యాడు. కృతఘ్నతకు మించిన పాపకృత్యం లేదనడానికి ధర్మగుప్తుడి కథ ఒక ఉదాహరణ!



# మీకుతెలుసా?

## టోపీలు

ఎండకూ, చలికీ మామూలుగా టోపీలు పెట్టుకునే వాళ్ళ సంఖ్య ఇవాళ బాగా తగ్గిపోయింది. 1940వ సం॥వరకు పట్టణాలలో ఎవరైనా సరే, ఇళ్ళనుంచి వెలుపలికి వెళ్ళాలంటే టోపీలు పెట్టుకుని మరీ వెళ్ళేవారు. ఇవాళ కూడా కొన్ని యూనిఫారాలలో అంతర్భాగంగా, మతసంబంధమైన ఉడుపులలో భాగంగా టోపీ ఇంకా కొనసాగుతూనే ఉన్నది. 'రష్యన్ ఫర్ హ్యాట్' శరీరంలోని వేడి తగ్గకుండా, చెవులకు మంచుతాకిడి లేకుండా కాపాడుతుంది. 'స్పానిష్ సాంబ్రిరో' అంచు ముఖంమీద ఎండ పడకుండా, కళ్ళనూ; వడదెబ్బ తగలకుండా మెదడునూ కాపాడుతుంది. దానిని ఒకవిధమైన రోమాలతో తయారుచేయడం వల్ల, చలి నుంచి కూడా రక్షణ కల్పిస్తుంది. ఉత్తర అమెరికాలోని రెడ్ ఇండియన్లు ధరించిన తలపాగా హుందాగానూ, అధికారానికి చిహ్నంగానూ ఉండేది (చిత్రంలోనిది). నాయకుడు మరీ పెద్ద తలపాగాను ధరిస్తాడు. బిషప్స్ ధరించే ఆర్చిలాంటి టోపీ (మైటర్) వారి అంతస్తుకూ, గొప్పతనానికీ చిహ్నం. ఈజిప్టులో ఎండ నుంచి తమను కాపాడుకోవడానికీ, తమజాతీయ వేషధారణకు అనువుగానూ 'టర్బన్లు' పెట్టుకుంటారు!




## ఇంద్రధనుస్సు




## ప్రకృతిఅనురూపత

సహజంగా వున్న అవయవ అనురూ పతకు సీతాకోకచిలుక ఒక అందమైన ఉదాహరణ. సీతాకోకచిలుక మధ్యగా నిలువునా ఒక గీత గీసి పరిశీలించినట్ట యితే ఒకవైపు అవయవాల పరిమాణం, ఆకారం, రెండవవైపు అవయవాల పరిమాణ ఆకారాలకూ ఏమాత్రం తేడా కనిపించదు. ఇలా ఒకదాని కొకటి ఎదురెదురుగా వున్న అవయవాలు సమానంగా ఉన్నట్టయితే దానిని అవయవఅనురూపత (సిమ్మెట్రీ)అని అంటారు. విభజన రేఖను అనురూపరేఖ అని అంటారు. మానవశరీరంకూడా అవయవానురూపత కలిగినదే. శిల్పశాస్త్రం శాస్త్రీయశైలిలో 'సిమ్మెట్రీ' ప్రధాన లక్షణం. ఈ శైలి యూరపులో పునరుజ్జీవనకాలంలో పునరుద్ధరించబడి 17,18 శతాబ్దాలలోనూ, 19వ శతాబ్దారంభంలోనూ ఎంతో ప్రాచుర్యంపొందింది.

స్వాతంత్ర్య స్వర్ణోత్సవ సంవత్సర చందమామ కానుక!

# ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం



[బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ గవర్నర్ జనరల్ డల్హౌసీ ప్రభువు– స్థానిక పాలకులు దత్తత స్వీకరించడం చెల్లదనీ, సంతానం లేనివారి రాజ్యం కంపెనీకే చెందుతుందనీ ప్రకటించాడు. ఈ నిరంకుశ శాసనం కారణంగా ఝాన్సీరాణి లక్ష్మీబాయి, నానాసాహెబ్ పీష్వా తమ రాచరికపు అంతస్తును కోల్పోయారు. ఝాన్సీ ప్రజలలోనూ అలజడి బయలుదేరింది. అదే సమయంలో దేశవ్యాప్తంగా వేలాదిమంది సిపాయిలు తెల్లదొరల అధికార దురహంకారానికి ఎదురుతిరగడానికి సిద్ధమయ్యారు. బారక్‌పూర్ సిపాయి మంగల్‌పాండే తెల్లవారికి ఎదురుతిరిగి, మిగిలిన సిపాయిలకు స్ఫూర్తినిచ్చాడు. సిపాయిలందరూ ఒక్కసారిగా తిరగబడాలని నానాసాహెబ్ రహస్యంగా పథకం ఆలోచించసాగాడు. ఝాన్సీ లక్ష్మీబాయి నానాసాహెబ్‌ను చూడడానికి వచ్చినప్పుడు, మీరట్‌లోని సిపాయిలు కంపెనీ అధికారానికి ఎదురుతిరిగారన్న వార్త అందింది. – తరవాత]

మీరట్‌లో బ్రిటిష్ అధికారానికి తిరగబడి అక్కడున్న అధికారులను హతమార్చిన సిపాయిలు అమితోత్సాహంతో ఢిల్లీకేసి బయలుదేరారు. ఢిల్లీకి రక్షణగా వున్న బ్రిటిష్ సైనికులనుఓడించారు. మొగలుల వారసుడు బహదూర్‌షాను హిందూస్థాన్ చక్రవర్తిగా ప్రకటించారు. అంతకుముందు బహదూర్‌షా అధికారాలన్నిటినీ అపహరించి, ఆయన్నొక సాధారణ పౌరుడిగా చేసిన బ్రిటిష్ దొరతనం ఇప్పుడేమీ చేయలేక మౌనం వహించింది!

ఈసంగతులన్నీ విన్నరాణీ లక్ష్మీబాయి నానాసాహెబ్‌తో, "అన్నయ్యా! ధైర్యవంతులైన ఆ మీరట్ యువకుల సాహస కృత్యాలను చూసికూడా మనంఇంకా ఊరుకోవడంభావ్యంకాదు. తమను నడిపించడానికి సరైన నాయకుడు లేకుండానే ఆ యువకులు స్వయంగా ఈ అద్భుత

కార్యంసాధించారు. వివేక సంపన్నులూ, ధైర్యసాహసాలకు మారుపేరూ అయిన మీరు, విశ్వాసపాత్రులైన అనుచరులతో మరిన్ని ఘనకార్యాలు సాధించవచ్చు కదా!" అన్నది.

"నిజమే! మనదేశానికి శ్రేయోదాయక మైన వాటిని సాధించడానికి, నేనూ నువ్వే కాదు; మనలాంటి దేశభక్తులు పలువురు ఆ మహాయజ్ఞంలో పాలుపంచుకోవాలి. అది దైవనిర్ణయం. నువ్వు నిశ్చింతగా వెళ్ళిరా!" అన్నాడు నానాసాహెబ్.

రాణీలక్ష్మీబాయి ఝాన్సీకి బయలు దేరింది. ఆమె అంగరక్షకులతో పాటు, అదనపు రక్షణ దృష్ట్యా మరికొందరిని కూడా పంపాడు నానాసాహెబ్. ఆమె సురక్షితంగా ఝాన్సీని చేరింది.

మీరట్ సిపాయిలతిరుగుబాటు అనం తరం, వలసపాలకులు స్థానికుల రాకపో కలను, చర్యలను మరింతజాగ్రత్తగా గమ నించసాగారు. ఆ సమయంలో కాన్పూరు లోని సైనికదళాలకు వీలర్ అనే ఆంగ్లే యుడు దళపతిగా ఉండేవాడు. ఆయన, అక్కడి సైనికులలో ఏదైనా తిరుగుబాటు వస్తే తనకు సాయం చేయగలవా-అని నానాసాహెబ్‌కు లేఖపంపాడు. ఒకప్పుడు నానాసాహెబ్ వాళ్ళకు అనుకూలంగా ఉండేవాడు. కానిఇప్పుడాయన ఆ లేఖకు సమాధానంగా – అలాంటి పరిస్థితి ఏర్ప డితే మీరు అలహాబాదుకుగాని, మీవాళ్ళు అధిక సంఖ్యలో వున్న వేరొక ప్రాంతా నికిగాని తరలి వెళ్ళడం ఉత్తమం అని తెలియజేశాడు.

అయితే, వీలర్ ఆయన సలహాను పెడచెవిని పెట్టాడు. మిగిలిన అధికా రులు స్థానికులపట్ల మునుపటికన్నా మరింత అహంకారంతో దురుసుగా వ్యవ





హరించసాగారు. చిన్న పొరబాటు చేసినా దారుణంగా హింసించి, అవమానించే వాళ్ళు. స్థానికులు ఆ అవమానాలను మౌనంగా భరించలేక బాధపడేవారు. కొందరు ఎదురుతిరిగేవారు. అలాఎదురు తిరిగిన ఒక ప్రముఖుడు ఒకసారి, "అయ్యలారా! మీరు పీష్వాకు అధికారం లేకుండా చేసివుండవచ్చు. అంతమా త్రాన మమ్మల్ని హింసించడం ద్వారా ఆయనపట్ల మేము చూపే గౌరవ మర్యా దలను లేకుండా చేయలేరు!" అన్నాడు.

వీలర్ ముందుచూపుతో కాన్పూరులో ఒక కోటను నిర్మించాడు. కాన్పూరులో వున్న బ్రిటిష్ కుటుంబాలన్నీ నివసించ డానికీ, వారికి అవసరమైన ఆహారపదా ర్థాలూ, రక్షణకు కావలసిన ఆయుధ సామగ్రీ నిలువచేయడానికీ వీలైనంత పెద్దదిగా ఆ కోట నిర్మాణం అతివేగంగా జరిగింది.

అయితే, అంతలోనే ఆపదముంచుకు రాగలదని వీలర్ అనుకోలేదు. నానా సాహెబ్ మిత్రుడైన తాంతియా తోపీ, మంత్రి అజిముల్లాఖాన్, మరికొందరు కలిసి, తెల్లదొరల దృష్టిని ఆకర్షించ కుండా రహస్యంగా పెద్ద తిరుగుబాటుకు పథకం వేశారు. ఒకనాటి అర్ధరాత్రి సమయంలో కాన్పూరులోని కంపెనీ ఖజా నానూ, ఆయుధాల గిడ్డంగినీ హఠాత్తుగా చుట్టుముట్టారు. ఆ భవనంచుట్టూ బ్రిటిష్ సైనికులు కాపలాకాస్తున్నారు. ఎదురుకాల్పులుజరిపారు. ఆ కాల్పులలో కొందరు తిరుగుబాటు దారులు కూడా మరణించారు. కాని రెండు గంటలలో ఆ భవనం తిరుగుబాటుదారుల హస్తగత మయింది!

దానిని చూసి వీలర్, బ్రిటిష్ కుటుం బాలన్నిటినీ కొత్తగా కట్టించిన కోటలోకి తరలించాడు. బ్రిటిష్ కుటుంబాలు గుంపులు గుంపులుగా కోటలోకి వెళ్ళసా గాయి. ఆ సమయంలో తిరుగుబాటు దారులు వారికి అడ్డుపడలేదు; ఎలాంటి హానీచేయలేదు. "మన బలాలను, శత్రు బలాలను బేరీజువేసుకుని పద్ధతిప్రకారం కార్యరంగంలోకి దిగాలి. అంతేగాని ఎప్పుడు పడితే అప్పుడు కళ్ళు మూసు కుని దాడిచేయకూడదు!" అని నానా సాహెబ్ తన అనుచరులకు సలహా ఇవ్వడమే అందుకు కారణం.

బ్రిటిష్‌కుటుంబాలన్నీ సురక్షితంగా కోటలోపలికి చేరాక, "తిరుగుబాటు దారులు కాన్పూరు కోటను ముట్టడించ గలరు!" అని హెచ్చరిస్తూ, నానాసాహెబ్, వీలర్‌కు ఒకలేఖ పంపాడు!

దానినిచూసి, "వాళ్ళనుముందే హెచ్చ రించడం అవసరమా?" అని అడిగాడు ఒక అనుచరుడు.

"అవును, అవసరం! వాళ్ళు కుట్రతో మన భూభాగాన్ని ఆక్రమించిన మాట నిజమే. అయితే మనం వారికి వ్యతిరే కంగా సాగిస్తూన్న యుద్ధంలోప్రతిఅడుగూ బహిరంగంగా ముందుకు వేస్తున్నామని వాళ్ళకు తెలియజేయాలి. వాళ్ళతో యుద్ధం చేయడానికి మనం సిద్ధంగా ఉన్నాం కదా? అలాంటప్పుడు మనలను ఎదుర్కోవడానికి వాళ్ళకు ఒక అవకాశం ఇవ్వడంలో తప్పేమిటి?" అన్నాడు నానా సాహెబ్.

కోటపై ముట్టడి ఆరంభమయింది. కోటలోని సైనికులు శిక్షణ పొందిన వాళ్ళయినప్పటికీ తిరుగుబాటుదారుల ధాటికి ఆగలేకపోయారు. కొన్నాళ్ళకు మందు గుండు సామగ్రి అయిపోయింది. ఆ తరవాత ఆహారధాన్యాలు అయిపో యాయి. ఆఖరికి తాగే నీళ్ళకు కూడా కోటలో కరువయింది. ఇక చేసేది లేక బ్రిటిష్ అధికారులు సంధికి సిద్ధమని శాంతిపతాకం ఎగురవేశారు.

వాళ్ళను లొంగిపొమ్మని నానాసాహెబ్ ఆజ్ఞాపించాడు. అధికారులు కోట నుంచి వెలుపలికివచ్చారు. తిరుగుబాటుదారులు



వాళ్ళను నానాసాహెబ్ సమక్షానికి తీసుకు వచ్చారు.

"మీపనిఅయిపోయింది. ఇకమిమ్మల్ని ఏం చేయమంటారు?" అని అడిగాడు నానాసాహెబ్.

"అలహాబాదుకు వెళ్ళి అక్కడున్న మా వాళ్ళను చేరుకుంటాం!" అన్నారు కంపెనీ అధికారులు.

కొంత చర్చ జరిగిన తరవాత, బ్రిటిష్ వాళ్ళను, పడవలలో అలహాబాదుకు వెళ్ళడానికి అనుమతించాలని తిరుగు బాటుదారులు నిర్ణయించారు. అందుకు కావలసిన ఏర్పాట్లన్నీ చకచకా జరిగిపో యాయి. పడవలుప్రయాణానికిఅనువుగా లేవని కొందరు అధికారులు ఫిర్యాదు చేయడంతో, వాటిని వీలైనంత ప్రయాణ

యోగ్యంగా తయారుచేయడానికి, నానా సాహెబ్ నిధులను కేటాయించాడు.

ఒకనాటి సూర్యోదయం వేళ దాదాపు వెయ్యిమంది ఆంగ్లేయ స్త్రీ పురుషులు నదిలోని పడవలలోకి చేరారు. పడవలు అలహాబాదుకు బయలుదేరాయి.

కాని అంతలో ఎవరూ ఊహించని దుర్ఘటన జరిగిపోయింది. పడవలు బయలుదేరుతూండగా, వాటిని చూడడానికి నదీతీరంలో వేలాదిమంది ప్రజలు గుమిగూడారు. బ్రిటిష్ అధికారుల దౌర్జన్యాలకు తమ తండ్రులనూ,సోదరులనూ కోల్పోయిన వాళ్ళు వారిలో చాలామంది ఉన్నారు. కాన్పూరులో కంపెనీ పాలన అంతమయిందన్న వార్త వ్యాపించడంతో, చుట్టుపక్కలనుంచి పలువురు సైనికులు అక్కడికి చేరారు. హఠాత్తుగా సైనికులు కొందరు పడవలకేసి కాల్పులుజరిపారు. ఆ ఉత్సాహంతో మరికొందరు నీళ్ళలోకి దూకి పడవలలోనివాళ్ళను కిందికి లాగసాగారు. వీరిని ప్రాణాలతో వదిలితే,వెళ్ళి మరికొందరితో కలిసి తిరిగివచ్చి తమ మీద పగతీర్చుకోగలరన్న అనుమానంతో తిరుగుబాటుదారులు, ఆంగ్లేయులను అక్కడికక్కడే హతమార్చడానికి పూనుకున్నారు!

ఈ సంగతి నానాసాహెబ్‌కుఅందేలోగా జరగవలసిన దారుణం జరిగిపోయింది. స్త్రీలనూ, పిల్లలనూ చంపకండి అని నానాసాహెబ్ తిరుగుబాటుదారులను హెచ్చరించాడు. ఆ విధంగా నూటపాతిక మంది స్త్రీలు, పిల్లలు మాత్రం ప్రాణాలతో బయటపడ్డారు. వారిని నానా సాహెబ్ తన భవనానికి తీసుకు వెళ్ళి, కూడు,నీడకుకొరతలేకుండా కొన్నివారాలు పోషించి, ఆ తరవాత వాళ్ళను అలహాబాదుకు సురక్షితంగా పంపించాడు.

కంపెనీపాలన తాత్కాలికంగా అంతం కావడంతో,ఆప్రాంతానికి నానాసాహెబ్‌ను రాజుగా ప్రకటించారు. నగరమంతా ఆనందోత్సాహాలు వెల్లివిరిశాయి. బ్రిటిష్ వాళ్ళపీడ శాశ్వతంగా విరగడయ్యిందనే ప్రతిఒక్కరూభావించారు.కాన్పూరునగరం తిరుగుబాటు విజయోత్సవాలు జరుపుకుంటూండగా, ఝాన్సీ పట్టణం కూడా ప్రశాంతంగాఊరుకోలేదు. -(ఇంకావుంది)





# ఉపకారాల పోటీ

సీతారామపురంలో ధనదాసు అనే భాగ్యవంతుడుండేవాడు. ఆయనబుద్ధులు మహా చెడ్డవి. ప్రతిరోజూ ఎవరినో ఒకరిని బాధించి, వినోదించడం ఆయనకు అలవాటు. అందుకోసం ఆయన డబ్బు చాలాఖర్చు పెడతాడు. కాబట్టి, నిత్యం ఎవరో ఒకరు వినోదించడానికి దొరుకుతూండేవారు.

ధనదాసు ప్రతిరోజూ తనఇంటి అరుగుమీద కొందరు మిత్రులతో కూర్చుంటాడు. డబ్బు అవసరమైన వాళ్ళు అక్కడకు వచ్చి, ఆయన పెట్టే మానసిక, శారీరకహింసలను అనుభవించి డబ్బు తీసుకుని వెళుతూండేవారు. డబ్బు తీసుకున్న వాళ్ళకు సంతోషముండదు కదా! ఆ విధంగా క్రమంగా ధనదాసు శత్రువుల సంఖ్య పెరిగిపోయింది.

ఆదేశపు రాజుకు మారువేషంలో దేశాటన చేసే అలవాటుంది. ఒకసారి ఆయనపేదరైతువేషంలో సీతారామపురం వచ్చి ధనదాసు గురించి విని ఆయనింటికి వెళ్ళాడు.

ఆ సమయానికిధనదాసు ఎప్పటిలాగే తనింటి అరుగుమీద కొలువు తీరి వున్నాడు. మారువేషంలో వున్న రాజును చూసి, ఆయన పేదరైతనుకుని, "ఏరా ఏమాత్రండబ్బుకావాలి?" అని అడిగాడు.

రాజు తడుముకోకుండా, "పదివరహాలండయ్యా," అన్నాడు.

"అయితే నువ్వు ముందుకు వంగి ఎద్దులా తయారవాలి. నీ తలకు కొమ్ములు తగిలించి గంగిరెద్దులా అలంకరిస్తాం. నీతోపాటు డోలూ, సన్నాయివాళ్ళూ వస్తారు. నువ్వు పదిళ్ళకువెళ్ళి గంగిరెద్దులా ఆడాలి," అన్నాడు ధనదాసు.

ఇది వింటూనే రాజు కోపం పట్టలేకపోయాడు. ఆయన తన మారువేషాన్ని

జొన్నలగడ్డ రామలక్ష్మి



తొలగించి, "నేనీ దేశానికి రాజును! నీ ఆగడాలగురించి విన్నాను. ఇప్పుడు ప్రత్యక్షంగా చూశాను. నువ్వు మనిషివి కాదు, రాక్షసుడివి. నీకు యావజ్జీవకారాగార శిక్ష విధిస్తున్నాను. అనుభవించు!" అన్నాడు.

ఊహించని ఈ పరిణామానికి నివ్వెరపోయిన ధనదాసు, రాజు కాళ్ళమీద పడి క్షమించమని వేడుకున్నాడు. కానీ రాజులో ఆవేశం తగ్గలేదు. ఈలోగా విషయం విని అక్కడికి వచ్చిన గ్రామాధికారి, "ప్రభూ! గతంలో ధనదాసు తండ్రి, తమ తండ్రిగారికి అనుకోని ప్రమాదపరిస్థితుల్లో సాయపడివున్నాడు. ఆ కారణంగా రాజకుటుంబం, ధనదాసు కుటుంబానికి ప్రత్యేక రక్షణలు కల్పించింది. తమరు మంత్రిగారి నడిగితే, ఈ విషయం చెప్పగలరు. ఈ కారణంవల్లనే గ్రామాధికారినైన నేను కూడా ధనదాసు అకృత్యాలను అరికట్టలేకపోతున్నాను. ఇప్పుడు ఉన్నపళంగా ధనదాసును శిక్షించడం తమకూ ధర్మం కాదు. చేసిన తప్పులు దిద్దుకునేందుకు, ఆయనకొక అవకాశం ఇవ్వండి," అంటూ రాజుకు నచ్చచెప్పాడు.

అప్పటికి శాంతించిన రాజుకు, గ్రామాధికారి మాటల్లోన్యాయమున్నదనితోచింది. ధనదాసుకు రక్షణ కల్పించడంలో రాజకుటుంబం చేసినతప్పు కొంతవున్నది కాబట్టి, ఆయన ధనదాసుకు ఒక అవకాశం ఇవ్వాలనుకుని,ధనదాసుతో, "దుర్మార్గుడా! ఈ ఊళ్ళో నీకు పరమశత్రువెవరోఎన్నుకో. ఒక నెల రోజులపాటు అతడికి నీ చేతనైనంత ఉపకారం చెయ్యి. అతడు కూడా నీకు ఉపకారం చేస్తాడు. శత్రువుకు ఉపకారం చెయ్యడంలో, అతడిని మించగలిగితే, నేను నిన్ను క్షమించి విడిచిపెడతాను. ఆతర్వాత కాలంలో నిన్ను కాపాడగలిగేది, నీ ప్రవర్తన మాత్రమేఅని గుర్తుంచుకో!" అన్నాడు.

అయితే, ధనదాసుకు ఊరినిండా శత్రువులే! అయినా వారిలోనుంచి ఒకణ్ణి ఎన్నుకునేందుకు ఆయన శ్రమపడలేదు. వెంటనే ప్రమదుడు గుర్తుకు వచ్చాడు.

ఒకసారి ఈ ప్రమదుడి కాలిమీదగాయమైంది. సరైన వైద్యంలేక అది పుండుగా మారింది. కాయకష్టం చేస్తే తప్ప రోజుగడవని ప్రమదుడు, వైద్యుడి దగ్గరకు వెళితే ఆయన, "పుండు ముదిరింది. దీనికి స్వర్ణభస్మానికి మించిన ఖరీదుగల భస్మం

అద్దాలి. ఇరవైవరహాలు తెస్తే మందు తయారుచేస్తాను," అన్నాడు.

కాయకష్టం మీద బతికేవాడికి, ఇరవై వరహాలెవరిస్తారు? ఇచ్చినా ఆ అప్పును వాడెలా తీర్చగలడు? ధనదాసు దగ్గర కాస్త శ్రమపడితే, డబ్బు సంపాయించుకో వచ్చని వాడు, ఆయన వద్దకు వెళ్ళాడు.

ధనదాసు, వాడితో, "నీకు ఇరవైవర హాలూ ఇస్తాను. కానీ ముందుగా నన్ను నీ పుండుకు వైద్యం చేయనివ్వాలి," అన్నాడు.

సరేననగానేఆయన, వాడినొక స్తంభా నికి కాళ్ళూ, చేతులూకట్టి నిలబెట్టించాడు. ప్రమదుడిపుండుమీద ఉప్పు, కారంఅద్ది నిమ్మకాయ పిండాడు. వాడుబాధతో కేకలు పెడుతూంటే చూస్తూ వినోదించాడు. అంతా అయ్యాక వాడి చేతిలో ఇరవై వరహాలు పెట్టి కట్లు విడిపించాడు.

ఆ వెంటనే ప్రమదుడు, ధనదాసు చెంపమీద గట్టిగా కొట్టి,"గతిలేక నేను నీడబ్బు తీసుకుంటున్నాను. నీ ఉపకారాన్ని నేనేమాత్రం గుర్తుంచుకోను. ఈ రోజు నుంచీ నేను, నీ మీద పగ సాధించడానికే జీవిస్తాను. నువ్వే నాకు పెద్ద శత్రువువి!" అన్నాడు.

ఇప్పుడుధనదాసు, ప్రమదుణ్ణి ఎన్నుకు నేందుకు కారణాలు చాలా వున్నాయి. వాడికి తనమీద ఎంత పగ వున్నదంటే తానెంత ఉపకారం చేసినా – వాడు ప్రత్యుపకారం చేయాలనుకోడు. అంతగా చేయాలనుకున్నా, అందుకు తనతో పోటీ పడలేడు. కారణం,తను భాగ్యవంతుడు;



వాడునిరుపేద. ఈ కారణాలతో పాటు, ఆ ఊళ్ళో తనను తిట్టుకునే వారేతప్ప, చెంపదెబ్బకొట్టిన వాళ్ళులేరు!

ఇలా ఆలోచించి, ధనదాసు, ప్రమదుడి పేరుచెప్పగానే గ్రామాధికారి కబురుపెట్టి వాడిని రప్పించాడు. ధనదాసు, రాజుకు పూర్వగాథను చెప్పి, "ప్రభూ! నేను నా శత్రువైన ప్రమదుడికి నా శక్తికొద్దీ సాయం చేస్తాను. శత్రువునైన నాకు, వాడు నేనిచ్చిన దేదీ తిరిగి ఇవ్వకూడదని మాత్రం వాడికి చెప్పండి," అని కోరాడు.

గ్రామాధికారి, రాజు, మరికొందరు ఊరిపెద్దలముందు ధనదాసు, ప్రమదుడు నెల రోజులపాటు పరస్పరం పోటీపడి సాయపడేందుకు ఒప్పందమయింది. ఈ వ్యవహారాన్ని గ్రామాధికారికి అప్పగించి



నెలరోజుల తర్వాత తిరిగి వచ్చి, పరిస్థితిని పరిశీలించి, తన నిర్ణయం తెలియచేయ గలనని చెప్పి, రాజు వెళ్ళిపోయాడు.

ఆ రోజు నుంచీ ధనదాసు ప్రవర్తన మారిపోయింది. ముందాయన ప్రమదుణ్ణి తన తప్పులన్నీ క్షమించమని కోరుకు న్నాడు. మరెన్నడూ వాడిపట్ల దుర్మార్గంగా ప్రవర్తించనని మాట ఇచ్చాడు. తర్వాత, ఆ ఊళ్ళో తనకున్న అందమైన ఇళ్ళలో ఒకటి వాడికిచ్చేశాడు. అప్పటి నుంచి ప్రతిరోజూ వాడి సంతోషంకోసం వినోద కార్యక్రమాలు ఏర్పాటు చేశాడు. వాడిని విందుభోజనానికి పిలిచాడు. వాడి పేర రోజూ గుడిలో పూజలు, అర్చనలు చేయిం చాడు. అలా నెలరోజులు, గడుస్తున్నా యనగా, చివరిరోజున ధనదాసు పొలంలో రెండెకరాలు వాడి పేర్రాసి, "ఇక మీదట ఇల్లు, పొలం సొంతం చేసుకుని సుఖంగా రోజులు వెళ్ళబుచ్చు," అన్నాడు.

ఈ నెలరోజుల్లోనూ ప్రమదుడు మాత్రం ఒక్కసారికూడా, ధనదాసుకు ప్రత్యుపకారం చెయ్యడానికి ప్రయత్నించ లేదు. ఊరంతా ఇందుకు విడ్డూరపడి, "డబ్బు లేకపోతే శ్రమదానం చెయ్యవలసింది. ప్రమదుడు స్వార్థపరుడు, మర్యాద తెలియని వాడు," అనుకున్నారు.

గడువుకాలం ముగిశాక, రాజు సీతా రామపురం వచ్చి, జరిగింది విన్నాడు. గ్రామాధికారి ఊరివాళ్ళందరినీ ఒకచోట సమావేశపరిచాడు. అక్కడ రాజు, ధన దాసుచేసిన మంచి పనులను మెచ్చుకుని ప్రమదుడిని, "నువ్వు ధనదాసుకు ఏవిధ మైన ఉపకారం చేసినట్టు కనబడదు. ఎందువల్ల?" అని అడిగాడు.

ప్రమదుడు చిన్నగా నవ్వి, "ప్రభూ! శత్రువుకు సాయపడాలన్నది ఒప్పందం. అయితే, మొదటిరోజున ధనదాసు నన్ను క్షమాపణ అడగ్గానే, నేను మా శత్రుత్వం సంగతిమరిచిపోయాను. నా శత్రువు కాని వాడికి నేను సాయపడాలన్న ఒప్పందం లేదు కదా!" అన్నాడు.

ఈ సమాధానానికి అందరూ తెల్లబో యారు. ధనదాసు, ప్రమదుణ్ణి శత్రువని గుర్తుంచుకోవడంవల్లనే, చివరిరోజు వరకూ ఉపకారం చేశాడు. మొదటి రోజునే శత్రుత్వాన్ని మరిచిపోయిన ప్రమ దుడి కంటే, ఆయన గొప్పవాడెలా అవు తాడు? శత్రుత్వాన్ని మరిచిపోవడానికి

మించిన ఉపకారం ఈప్రపంచంలో వేరే ఏదైనా వున్నదా?

ఇలా అందరూ ఆలోచిస్తున్న సమయంలో, ధనదాసు లేచి నిలబడి, "నేను గతంలో ప్రమదుడి ప్రాణాలతో చెలగాటమాడాను. అంతటి శత్రుభావమూ నేను వాడిని క్షమించమని అడిగిన ఒక్కమంచి మాటతో పోయింది. ఒక్క మంచి మాటకు ఇంత విలువవుందని తెలియక, ఇన్నాళ్ళూ దుష్టకార్యాలుచేసినందుకు సిగ్గుపడుతున్నాను," అన్నాడు.

రాజు, ధనదాసును కూర్చోమని ప్రమదుడితో, "నువ్వు ధనదాసుతో శత్రుత్వాన్ని మరిచిపోవడం గొప్ప విషయం. కాబట్టి నెలరోజులనుంచీ ఆయన నీకు మిత్రుడు. ఏమాత్రం సంకోచించకుండా ఉపకారం చేస్తున్న మిత్రుడికి ప్రత్యుపకారం చేయాలని నీకు తోచలేదా?" అని ప్రశ్నించాడు.

అందుకు ప్రమదుడు, "ప్రభూ! గాయం మండుతున్నప్పుడు, ఆవేశంలోఎన్నితిట్టినా, ఆ తర్వాత నాకు ధనదాసు మీదకోపం లేదు. ఆయనిచ్చిన డబ్బుతోనే గాయం నయంకావడంవల్ల ఆయనపట్ల నాకు కృతజ్ఞతాభావం కూడా వున్నది. నా వంటి పేదవాళ్ళకు సమస్య శాశ్వతంగా పరిష్కారమైతే, తాత్కాలికంగా ఎంతటి బాధనైనా భరించగల శక్తి వుంటుంది. తరచుగా కాక నూటికీ కోటికీ ఒకసారి వచ్చి మా కష్టాలు తెలుసుకునే మహారాజుల ఆలోచనలు విచిత్రంగా వుంటాయని, నా భయం.నేను ఏమాత్రంసాయం చేసినా దానికిఎక్కువ విలువకట్టి, ధనదాసు మేలును తక్కువ చేస్తే, ఆయనకు యావజ్జీవకారాగార శిక్ష తప్పదు కదా! కాబట్టి ఏవిధమైన ప్రత్యుపకారం చేయకపోవడమే, నా మిత్రుడికి నేను చేయగల ప్రత్యుపకారం," అన్నాడు.

రాజు, ప్రమదుడి ఔదార్యాన్ని మెచ్చుకుని,"చెప్పాలంటే, ఈఉపకారాల పోటీలో ప్రమదుడే నెగ్గాడు. కానీ ప్రమదుడు నెగ్గాలంటే, నేను ధనదాసును క్షమించి విడిచి పెట్టాలి. ఇక మీదట ప్రమదుడి వంటి వాళ్ళు, ధనదాసుల పాలబడకుండా దేశంలో పేదవాళ్ళకు ఉచితవైద్య, ఋణ సౌకర్యాలు ఏర్పాటుచేస్తాను," అని ఊరి వాళ్ళకు చెప్పి, తిరిగి రాజధానికి వెళ్ళాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1998 జనవరి నెల సంచికలో ప్రకటింపబడును.


DHARM NATH PRASAD


DHARM NATH PRASAD

✷ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ✷ నవంబర్ నెల 25వ తేదీలోగా, వ్యాఖ్యలు మాకు చేరాలి. ✷ మాకు చేరిన వాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం.✷ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:

**చందమామ ఫోటో వ్యాఖ్యలపోటీ, చెన్నయ్– 6000 026**

## సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఉషారు పుట్టించే బండిజోరు!

రెండవ ఫోటో : ఉసూరనిపించే బతుకుతీరు!!

పంపినవారు : డా।। ఎం.వి. మురళి

12-13-314, వీధినెం-13, తార్నాక, సికింద్రాబాదు– 500 017



Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., Chandamama Buildings, Chennai - 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, 188, N.S.K. Salai, Vadapalani, Chennai - 600 026 (India) Editor : NA[illegible] REDDI.

CHANDAM MA ( elugu) November 1997 Regd. No. M. 4854/97
RN 114 / 57